# శ్రీవాణి జీవిత సభ్యులు



Sri P.V. Mallikarjuna Rao
Smt. P. Umadevi
Rajahmundry - 533 103



Sri Pratapa mrutyumjayam
Smt. P. Rajamani
Vemulavada - 505 302



Sri P. Srinivas
Smt. P. Usha Srinivas
Whitefield Bangalore



Dr. M.N. Avadhanulu
Smt. M. Suvarchala
Ramtek - 441 106 Maharastra



Sri S.V. Rama Rao
Smt. S.Radha Vijayalakshmi
Puttaparthi - 515 134



Dr. Agastyaraju Vasudeva Rao
Smt. Agastyaraju Sarojini
Kapileswarapuram - 521 426



Sri M.V.S. Chowdary
Smt. M.D.V. Lakshmi
Amalapuram - 533 201



Sri D.V.S. Prasad
Vijayawada - 520 008

Col. M. Venkata Ramana
Murthy (Retd)
Secunderabad - 500 594



మార్చి 2000
సంపుటి 16 సంచిక 3

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
☏ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-03-2000**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



మాటలకు, వ్రాతలకు అందని మహోన్నత మూర్తి, నేటితరం వ్యక్తి

**డా॥ శరద్ కుమార్ దీక్షిత్**

సంపాదకీయం

# అభినందనలు

"రాజ్యాంగ మౌళిక స్వరూపాన్ని, లక్షణాలను మార్చకుండా, గత 50 సంవత్సరాల అనుభవాలను దృష్టిలో పెట్టుకొని, రాజ్యాంగాన్ని సమీక్షించవలసి ఉన్నది. రాజ్యాంగంలో పేర్కొన్న ఆదర్శములను మరింత మెరుగైన రీతిలో అందుకోవా లంటే ఇది అవసరం" అని రాష్ట్రపతి శ్రీ కె ఆర్. నారాయణన్ ఫిబ్రవరి 23న ఏర్పాటు చేసిన పార్లమెంటు ఉభయ సభల సంయుక్త సమావేశంలో స్పష్టంగా పేర్కొనినారు

కేంద్ర ప్రభుత్వానికి, రాష్ట్రపతికి మధ్య ఈ విషయంలో తీవ్ర విభేదాలున్నాయని ప్రచారం చేసేవారికి, రాష్ట్రపతి ప్రసంగం కనువిప్పు కాగలదు రాజ్యాంగ సమీక్ష కోసం ఏర్పాటు చేయబడిన కమిటీ నిర్ణయం భారత ప్రభుత్వం యొక్క సమిష్టి, ఏకగ్రీవ నిర్ణయమేనని స్పష్టం చేసినట్లయింది ధైర్యంగా, స్పష్టంగా పార్లమెంటులో ప్రకటన చేసి, విమర్శనలకు తెరదించారు రాష్ట్రపతి వారికి అభినందనలు

గతంలో గణతంత్ర స్వర్ణోత్సవాల సందర్భంలో రాష్ట్రపతి చేసిన ప్రసంగాన్ని నునిశితంగా పరిశీలిస్తే, రాజ్యాంగ సమీక్ష విషయంలో, రాష్ట్రపతికి, కేంద్ర ప్రభుత్వానికి ఎట్టి భేదాభిప్రాయములు లేవనే విషయం కూడా స్పష్టమవుతుంది. అయితే ఆనాడు వారు చేసిన ప్రసంగాన్ని వక్రీకరించి ప్రచారం చేయడం జరిగింది రాష్ట్రపతిగాని, ప్రధానమంత్రి గాని రాజ్యాంగ సమీక్షా కమీషన్ ఛైర్మన్ శ్రీ ఎం ఏ ఎన్ వెంకటాచలయ్య గాని మొదటి నుంచీ ఒక విషయం స్పష్టం చేస్తూనే ఉన్నారు రాజ్యాంగం యొక్క మౌళిక సూత్రాల జోలికి పోమని పలు పర్యాయములు స్పష్టం చేశారు కమీషన్ చేసే సూచనలు పార్లమెంటులో ప్రవేశపెట్టబడుతాయని, అక్కడ సమగ్ర చర్చ జరుపవచ్చని కూడా స్పష్టం చేశారు అయినప్పటికీ కొన్ని ప్రతిపక్షాలు ఈ విషయంలో అనవసరమైన గందరగోళాన్ని సృష్టించాయి అసలు కమీషన్ వేయుటమే సమంజసం కాదని వాదిస్తూ, విమర్శిస్తూ వచ్చారు గత యాభై ఏళ్ళ అనుభవాలను సమీక్షించుకోవటంలో తప్పు ఏముంది? అసలు రాజ్యాంగం విఫలమైందా? దానిని అమలు పరచేవారు విఫలమయ్యారా? అనే విషయమును పరిశీలించడం తప్పా? మారుతున్న పరిస్థితులకనుగుణంగా కొన్ని మార్పులు చేసుకొని ముందుకు నడవటం పొరపాటా? గత అనుభవాలను దృష్టిలో పెట్టుకొని, రాజ్యాంగాన్ని సమీక్షించడం సమంజసం కాదా? అసలు ప్రతిపక్షాలు ఎందుకు ఇంత భయపడాలి? కమీషన్ వేసినంత మాత్రంలో అయ్యేదేమిటి? వారి పరిధి విచారణ చేయటం, పరిశీలించటం, వారి అభిప్రాయాలను పార్లమెంటు ముందు ఉంచటమే గదా! ఎట్టకేలకు చిట్టచివరికి పార్లమెంటులో ఈ సవరణలు ఆమోదించబడాలిగదా! లోక్‌సభలోగాని, రాజ్యసభలోగాని అధికారపార్టీకి అవసరమైన 2/3 వంతు మెజారిటీ లేదు గదా! రాష్ట్రపతి ఆమోద ముద్రవేసిన తరువాతనే ఈ సవరణలు అమలులోనికి వస్తాయి గదా! ఇంత తతంగం ఉన్నప్పడు, ఇటువంటి పరిస్థితులలో ప్రతిపక్షాలు భయపడవలసిన అవసరం ఏమిటి? అగత్యం ఏమిటి?

యావత్ ఈ సమస్యను నునిశితంగా పరిశీలిస్తే రాజకీయ విశ్లేషకులకు రెండు విషయాలు గోచరిస్తాయి. **1. కేవలం విమర్శనలు గుప్పించి, గందరగోళాన్ని సృష్టించడమే ప్రతిపక్షాల ప్రధాన లక్ష్యమై ఉండాలి. 2. తమ పార్టీ సభ్యులే కమీషన్ సూచించిన రాజ్యాంగ సవరణలకు అనుకూలంగా ఓటు చేస్తారేమోననే భయం ప్రతిపక్షనాయకులలో ఉండి ఉండాలి.** గందరగోళాన్ని సృష్టించడమే ప్రతిపక్షాల లక్ష్యమైతే, ఇది ఏమాత్రం సత్సంప్రదాయమనిపించుకోదు. తమ సభ్యుల పైననే ప్రతిపక్షనాయకులకు గనుక విశ్వాసం లేకపోతే, ఎవరూ, ఏమీ చేయగలిగింది లేదు. అయినదానికి, కానిదానికి విమర్శించడం ప్రతిపక్షాల లక్ష్యం కారాదు. ప్రభుత్వం చేసే పొరపాట్లను మాత్రమే బహిర్గతం చేసి, ప్రజల దృష్టికి తీసుకొని వచ్చి, ప్రభుత్వాన్ని సరియైన మార్గంలో నడిపించవలసిన బాధ్యత ప్రతిపక్షాలది. అప్పడే ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది కనుక అటువంటి విశిష్టమైన, ఉత్తమమైన Watch Dog పాత్రను ప్రతిపక్షాలు నిస్వార్ధంగా నిర్వర్తించినప్పడు వారి (ప్రతిపక్షాలు) ప్రతిష్ఠ పెరుగుతుంది, దేశ గౌరవ ప్రతిష్ఠలూ ఇనుమడిస్తాయి ప్రతిపక్షాలను సంప్రదించి, శాంతియుత సుహృద్భావ వాతావరణంలో వారిని ఒప్పించి, ముందుకు కలిసిగట్టుగా నడిచినప్పడు, ఆశించిన ప్రగతిని అతిత్వరలో సాధించగలుగుతామనే సత్యమును అధికార పార్టీ కూడా విస్మరించరాదు అధికార, ప్రతిపక్షపార్టీలు బండికి రెండూ రెండు చక్రాలవంటివి. ఏ చక్రం పనిచేయకపోయినా, ఆ బండి చేరుకోవలసిన ప్రదేశమునకు చేరుకోలేదు. కనుక పట్టుదలలకు పోకుండా సామరస్య ధోరణిలో అధికార, ప్రతిపక్షపార్టీలు సమైక్యంగా ముందుకు నడవటం సముచితం, సమంజసం-ప్రజాస్వామ్య వాదుల ఆకాంక్ష ఇదే.

**(కొమరగిరి కృష్ణమోహనరావు)**

# మాటలకు, వ్రాతలకు అందని మహోన్నతమూర్తి, నేటితరం వ్యక్తి

# డా॥ శరద్ కుమార్ దీక్షిత్

వైష్ణవ జనతో తేనే కహియేజె పీడ్ పరాయే జాణేరే......'

టేప్‌రికార్డర్‌లో గానకోకిల లతామంగేష్కర్ సుమధుర స్వరాలాపన ప్రకృతిని పరవశింప చేస్తోంది. ఆ స్వరమాధురి అలలు అలలుగా గాలిలో తేలుతూ కదిలివస్తూ ఆ గదినంతటినీ ఆధ్యాత్మిక భావ తరంగాలలో ముంచెత్తుతున్నది. సమయం మధ్యాహ్నం గం॥ 12-00. రెండు సంవత్సరాల వయస్సున్న షీలాచోటేకు డాక్టరు మత్తు ఇంజక్షన్ (ఎనస్తీషియా) ఇచ్చారు. ఇంతలో చక్రాల కుర్చీలో కూర్చున్న ఓ డాక్టరు ముందుకు వచ్చారు. అప్పుడే మగతలోకి జారుకున్న ఆ పాప గ్రహణం మొర్రి పెదవి (Cleft Lip)ని పరిశీలించారు. మరునిమిషం ఇంజక్షన్ను, కత్తెరల నందుకున్న ఆయన చేతులు చకచకా నాట్యం చేయడం మొదలయ్యాయి. పూర్తవగానే ఆమెను వేరే బల్లపై పడుకో బెట్టారు. అప్పుడు సమయం గం॥ 12-04ని॥లు. ఒక వలంటీర్ సొనాలీ కామ్తే అనే మరొక రెండేళ్ళ పాపను తీసుకు వచ్చారు. చక్రాల కుర్చీలో కూర్చున్న ఆ వ్యక్తి ముందుకు కదిలి ఆ పాప మెల్ల కళ్ళను పరిశీలించారు. పాపకు ఎనస్తీషియా ఇవ్వటం అప్పటికే పూర్తయింది. ఇక ఆపరేషన్ మొదలయింది. సమయం గం॥ 12-08ని॥లు. పాప మెల్ల కంటికి ఆపరేషన్ పూర్తయింది. షీలాచోటేని ముందుకు తీసుకువచ్చారు వలంటీర్లు. డాక్టరు ఆమె పెదవిపై కుట్లువేసి శుభ్రం చేసి మిగిలిన పనులు చకచకా పూర్తి చేసారు. సమయం గం॥ 12-30 నిమిషాలైంది. టేప్‌రికార్డర్‌లో కాసెట్ వెనుకకు త్రిప్పి ఆశాభోంస్లే భజన వింటూ మూడవ సర్జరీకి ఉద్యుక్తుడైనాడు ఆ డాక్టర్. వైద్యరంగంలో ఎంతో అపార అనుభవం కల్గి, సిద్ధహస్తులని పేరు గడించిన హేమహేమీల వంటి డాక్టర్లకు సైతం సుమారు గంటపైన పట్టే ప్లాస్టిక్ సర్జరీ ఆపరేషన్లను 15 నిమిషములలోపే పూర్తి చేసిన ఆ డాక్టరు ఎవరు? ఏతరం నాటివారు, ఏ దేశంవారు? అన్న ప్రశ్నలు ఎవరినైనా వేధించక మానవు. ఆయనే డాక్టరు శరద్‌కుమార్ దీక్షిత్. భారత దేశంలో పుట్టిపెరిగి అమెరికా లోని బ్రూక్‌లిన్‌లో స్థిరపడిన నేటి తరం వ్యక్తి, మాటలకు, వ్రాతలకు అందని మహోన్నత శక్తి, కర్మయోగి డాక్టర్ దీక్షిత్. మృత్యువు పడగనీడలో తలదాచుకొంటూ, చక్రాల కుర్చీకే అంకితమైనప్పటికీ, ఊహింపశక్యం కాని విధంగా భారత దేశంలో ప్రతి సంవత్సరం కొన్ని వేల మంది పేదవారికి ఉచితంగా ప్లాస్టిక్ సర్జరీ ఆపరేషన్లు చేస్తూ, వారికో కొత్త రూపాన్ని సంతరింపచేసి కొత్త జీవితాలను ప్రసాదిస్తూ వారి జీవనజ్యోతులను వెలిగిస్తూ తన జీవితాన్ని కొవ్వొత్తిగా మలచుకుంటున్న వైనం గమనిస్తే, 69 ఏళ్ళ డాక్టరు దీక్షిత్ ఓ వ్యక్తి కాదు భగవంతుని అంశయేనన్పించక మానదు.

## కొమరగిరి మాధవిశ్యామ్

మహారాష్ట్రలోని వార్ధాలో బ్రిటిష్ పోస్టల్ సర్వీస్‌లో పని చేస్తున్న మధ్యతరగతి కుటుంబీకులైన శ్రీ సీతారామ్ దీక్షిత్, మాలతీబాయ్ దంపతుల సంతానంగా శ్రీ శరద్‌కుమార్ జన్మించారు. ప్రతి నిత్యం వారి ఇంటి ముందు నుండే వ్యాహ్యాళికి వెళ్తుండే మహాత్మాగాంధీని చిన్ననాటి నుండే ఆసక్తిగా గమనించి, వారి సేవాతత్పరతకు ముగ్ధులై, తాను కూడా గొప్ప డాక్టరై ప్రజలకు సేవలు చేయాలని కలలు కనేవారు.

1948లో నాగపూర్‌లోని మెడికల్ కాలేజిలో శ్రీ దీక్షిత్ వైద్య విద్యనిమిత్తం ప్రవేశించారు. అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వారి ఫెల్లోషిప్‌లకు అర్హత సంపాదించిన శ్రీ శరద్ ఆర్మీలో డాక్టరుగా చేరాలనుకున్న తన కోరిక విరమించుకొని దూరదేశాలను చుట్టి రావచ్చుననే ఉత్సాహముతో అమెరికాకు బయలుదేరారు. ఖర్చుల నిమిత్తం ఆయన చిన్న ఉద్యోగం ఒకదాన్ని అక్కడే వెదుక్కొన్నారు. తనకు వచ్చిన 250 డాలర్లలో, తల్లిదండ్రులకు నెలకు 200 డాలర్ల వరకు పంపిస్తుండేవారు. డెట్రాయిట్‌లోని గ్రేస్ హాస్పిటల్‌లో నాలుగు ఏళ్ళ సర్జరీ

కోర్సును మరియు ప్లాస్టిక్ సర్జరీలో ప్రత్యేక కోర్సును పూర్తి చేసారు. డెట్రాయిట్ హాస్పిటల్‌లో సంవత్సరానికి 40,000 డాలర్ల జీతంతో శ్రీ దీక్షిత్ డాక్టరుగా ఉద్యోగం ప్రారంభించారు. అయితే ఆయన ఎప్పుడూ భారతదేశానికి తిరిగి వెళ్ళిపోవాలని, పేదలకు సేవ చేయాలని ఆలోచనతోనే వుండేవారు. 1968లో ఆయన భారతదేశంలో స్థిరపడాలని ప్రయత్నించారు. అయితే ప్లాస్టిక్ సర్జన్‌కు అప్పటికి భారతదేశంలో అవకాశాలు తక్కువగా వున్నాయనీ, ఆయన స్నేహితులు అమెరికాలోనే వుండి భారతదేశంలో పేదప్రజలకు సేవ చేయవలసినదని సలహాలు ఇచ్చారు. వారి మాటలలోని నిజాలను అంగీకరించి, డా॥దీక్షిత్ అమెరికా తిరిగి వెళ్ళారు. అయితే అదే సంవత్సరం శ్రీ దీక్షిత్ తన మొట్టమొదటి ఉచిత ప్లాస్టిక్ సర్జరీ శిబిరాన్ని ముంబయిలో నిర్వహించారు. దీనికి లయన్స్ క్లబ్ వారు ఆధ్వర్యం వహించారు. ఆ శిబిరమే ఆయన ప్రతి సంవత్సరం భారతదేశయాత్రలకు నాందీ వాచకం పలికింది.

భారతదేశంలో ప్లాస్టిక్ సర్జరీ అంతగా అభివృద్ధి చెందని రంగము అయినప్పటికీ వరుసగా 10 సం॥లు డా॥ దీక్షిత్ ముంబయిలో ఉచిత శిబిరాలు నిర్వహించారు. రోజుకు 30 సర్జరీలు చొప్పున 3 వారాలు ఏకబిగిన ఉచితంగా వైద్యశిబిరాలు నిర్వహించేవారు. 1971లో డా॥ దీక్షిత్ ఒక వ్యాపారవేత్త ఆహ్వానం పై ఒక శిబిరానికి పర్యవేక్షకులుగా వెళ్ళారు. అక్కడ వలంటీర్ల, నిర్వాహకుల అశ్రద్ధ వలన ఇద్దరు రోగులు మరణించటం చూసిన ఆయన మనసు కలతచెంది ఉచిత వైద్యశిబిరాలు సమర్థంగా నిర్వహించాలంటే మంచి సేవా ధృక్పదం కల్గిన సేవాసంస్థలు, సేవాతత్పరత కల్గిన వలంటీర్లు ఎంతో అవసరం అని గుర్తించారు. ఆ తరువాత అప్పటి నుండి ఇప్పటివరకు డా॥ దీక్షిత్ నిర్వహించిన రు. 44,000 సర్జరీలలో ఏ ఒక్కటీ వృధా కాలేదు. ఔరంగాబాద్-చిలకల్‌తానా వారి లయన్స్‌క్లబ్ ఆధ్వర్యంలో, రోటరీ క్లబ్, వ్యాపార సంస్థల ఆధ్వర్యంలో, డా॥ దీక్షిత్ ప్రతి సంవత్సరం విజయవంతంగా ఎన్నో ఉచిత శిబిరాలను నిర్వహిస్తున్నారు. మొదట్లో ముంబయికి మాత్రమే పరిమితమైన ఆ శిబిరాలు క్రమేణా ఇతరప్రాంతాలకు కూడా విస్తరించాయి. పేద ప్రజలు ముఖ్యంగా పసిపిల్లలు, పెళ్ళి కావల్సిన యువతులు ఎందరో డా॥ దీక్షిత్ చేతుల మీదుగా అందాన్ని, ఆరోగ్యాన్ని అందుకొని తద్వారా నూతన జీవితాలను ఆరంభిస్తున్నారు. గ్రహణం మొర్రి పెదవి, ముక్కు, మచ్చలు,కాలినమచ్చలు, మెల్లకన్ను వంటివెన్నో (Cleft Lip, Cleft Palate, Scar, Nevus, Squint, Burns, Deformed Nose) సరిచేసి, పేదప్రజల జీవితాలను అందంగా మలుస్తున్న అపరబ్రహ్మ డా॥ దీక్షిత్.

అలస్కాలోని ఫెయిర్ బ్యాంక్స్‌లో డా .దీక్షిత్ ప్లాస్టిక్ సర్జన్‌గా కీర్తి గడిస్తూ, ఐశ్వర్యాన్ని సంపాదిస్తూ, ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా అయిదు నెలలు భారతదేశంలో రోగులకు ఉచితంగా సర్జరీలు చేస్తూ ఆనందమయ జీవితం గడుపుతుండగా విధి వైపరీత్యం వలన 1978వ సంవత్సరంలో డా॥ దీక్షిత్‌కు కార్ యాక్సిడెంట్ జరిగింది. దానితో ఆయన శరీరంలో కుడి భాగం పూర్తిగా చచ్చుపడిపోయింది. అయినా డా॥ దీక్షిత్ భారతదేశంలో తన ఉచిత వైద్యశిబిరాల నిర్వహణను

## వందే రత్నాకరమ్

వందే సుందర 'సత్యసాయి పరమం' సౌందర్య రత్నాకరం
'భారద్వాజ' 'సుగోత్ర' రాజశిఖరం' ప్రేమప్రభా విగ్రహమ్ !
'ఆపస్తంబ' సువర్ణ సూత్రతరలం లీలా జగన్నాయకం
శాంతి శ్రీ హృదయం - ప్రశాంతి నిలయం - సత్యం -
శివం - సుందరమ్

శాంతాకారం - కరుణ చరణం - మందహాసం - విలాసం
శ్రీవత్సాకం - తరళనయనం - కేశజాలం - సుచేలమ్!
సౌందర్యాగం - లలిత చుబుకం - భూతిహస్తం - సమస్తం
సత్యానందం - వరసురతరుం - సాయిరామం భజే2హమ్ !!

సత్యధర్మధరం - దేవం - కారుణ్య రసవిగ్రహమ్ !
ప్రసన్న వదనం శాంతం - సాయిరామం నమామ్యహమ్ !
ప్రేమావతార సర్వస్వం - ఈశ్వరం మానవాకృతిం!
సందీపం సారచిద్రూపం - వందే శ్రీ సత్యసాయినమ్

- శాంతిశ్రీ, ప్రశాంతినిలయం

ఆపలేదు. కుడిచేయి కదలనని మొరాయిస్తుంటే ఎడమచేత్తో కూడా ఆయన సర్జరీలు నిర్వహించేవారు. క్రమంగా నాలుగేళ్ళకు డా॥ దీక్షిత్ కోలుకోగలిగారు. అయితే అప్పుడు ఆయనకు స్వరపేటిక (Larynx) కాన్సర్ వున్నట్లుగా డాక్టర్లు నిర్ధారణ చేసి ఆయన ఆరునెలలకు మించి బ్రతకరని తేల్చి చెప్పారు. అయితే ఏ మాత్రం అధైర్యపడని డా॥ దీక్షిత్ రేడియేషన్ ట్రీట్‌మెంట్ తీసుకోవటం ప్రారంభించారు. ఎంతో అద్భుతంగా శాస్త్రీయ సంగీతాలాపన చేసే డా॥ దీక్షిత్ తన గొంతు పోగొట్టుకొని దాదాపు ఐదేళ్ళపాటు మూగవాడిగా వుండిపోయారు. ఇదిలా వుండగా 1988లో అమెరికాలో డా॥ దీక్షిత్ గుండెపోటుకు గురయ్యారు. మరల 1994లో అహ్మదాబాద్‌లో సర్జరీ క్యాంప్‌లో ఉండగా మరొకసారి హార్ట్‌ఎటాక్ వచ్చింది. అందువలన ఆయనను ట్రిపుల్ బైపాస్ సర్జరీ నిమిత్తం అమెరికా తీసుకువెళ్ళారు. అయితే అత్యంత ఆశ్చర్యకరమైన, నమ్మశక్యం గాని విషయం ఏమిటంటే ఇన్ని ప్రతికూల పరిస్థితులు ఎదురైనా డా॥ దీక్షిత్ ఇండియాలో సంవత్సరంలో 5 నెలలు పాటు తను నిర్వహించే ఉచిత వైద్యశిబిరాలను నడుపుతూనే వున్నారు. ఎంతో మంది పేద ప్రజానీకానికి క్రొత్త వెలుగులను ప్రసాదిస్తూనే వున్నారు. "ఆపరేషన్ థియేటర్ నా దేవాలయం. రోగులలో నేను భగవంతుణ్ణి చూస్తాను. ప్రతి సంవత్సరం నా భారతదేశ సందర్శన నాకు ఒక తీర్థయాత్ర వంటిది" అంటారు స్వరపేటిక స్థానంలో కృత్రిమంగా ఏర్పాటు చేసిన పరికరం సహాయంతో డా॥ దీక్షిత్. పట్టుమని పది నిమిషాలు కూడా లేచి నిలబడలేని తనకు సర్జరీలు చేసే శక్తి ఆ భగవంతుడు ఇచ్చినదేనని, ఇందులో తాను నిమిత్తమాత్రుణ్ణి అని పదే పదే చెప్తుంటారు శ్రీ శరద్. తాను ఆపరేషన్ థియేటర్‌లో ప్రతినిత్యం వినే భజనలు తనలో ఆధ్యాత్మికశక్తిని ప్రేరేపించి, సర్జరీ చేసేందుకు కావలసిన ధైర్య స్థైర్యాలను కలిగిస్తాయి అంటారు ఆయన. రెండు సంవత్సరాలుగా నోబుల్ శాంతి బహుమతి ఎన్నికకు ప్రతి పాదించబడిన వ్యక్తుల జాబితాలో డా॥ శరద్‌కుమార్ దీక్షిత్ పేరు అగ్రస్థానంలో వుంది. 10సంవత్సరాలుగా ఆయనకు సర్జరీలలో సహకరిస్తున్న డా. పాల్ డ్రెస్‌నాక్ పేరు కూడా జత పరచబడింది. అయితే ఇవేవీ పట్టించుకోని దీక్షిత్ భగవంతుడు ఇచ్చిన శక్తిని తిరిగి ఉపయోగించటంలో గొప్పతనం ఏముంది అంటూ కొట్టి పడేస్తారు.

వ్యక్తిగతంగా ఆయన 1.5 మిలియన్ల డాలర్లతో ఒక ట్రస్ట్‌ను ఏర్పరచి, దానిలో కొంత రిసెర్చ్ అవసరాలకు కేటాయించి, మిగిలిన మొత్తాన్ని అంతటిని ప్లాస్టిక్ సర్జరీల నిమిత్తం అయే ఖర్చులకు కేటాయించారు. 25 సం॥లుగా నడుస్తున్న ఈ ఉచితవైద్యశిబిరాలు ముందుముందు ఇదే విధంగా నడవాలని ఆయన ప్రగాఢ ఆకాంక్ష. ప్రతి సంవత్సరం డా॥ దీక్షిత్ సర్జరీలకు అవసరమైన సూదులు, సూచర్స్, మత్తుమందుల నిమిత్తం 50,000 డాలర్ల వరకు ఖర్చు పెడుతారు ఎలాగూ నేను ఈ భూమిపై ఎక్కువ కాలం వుండను. ఇక ఈ డబ్బుతో నాకు పనేముంది అనే ఆయన మాటలకు స్పందించని వారెవరుంటారు?

మొదటి భార్యనుండి విడాకులు తీసుకున్న అనంతరం డా॥ దీక్షిత్ 1979లో రెండవ వివాహం చేసుకున్నారు. అయితే వైద్యరంగంలో తలమునకలయి, సంసారిక జీవితానికి న్యాయం చేకూర్చలేకపోయారేమో, రెండవ పర్యాయం కూడా విడిపోవలసి వచ్చింది. అయితే తన రెండవ భార్య కూతురైన సుప్రియ అంటే ఆయనకు ఎనలేని అభిమానం. ఆమె ఫోటోను తనతోపాటే తీసుకువెళ్తుంటారు. స్వభావరీత్యా ఎంతో సరదాగా వుండే దీక్షిత్ రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్, ముంతాజ్, దేవానంద్, మాధురీదీక్షిత్ తనకు ఇష్టమైన తారలని చెప్తూ ఇదివరలో గొంతెత్తి చక్కటి గజల్స్ ఆలపించేవాడినంటారు. అయితే ప్రస్తుతం ఆయన చాలా తొందరలో వున్నారు. భగవంతుడు తనను తీసుకొని వెళ్ళిపోయే లోపల వీలైనంత ఎక్కువ మందికి సేవ చేయాలని తహతహలాడుతున్నారు. న్యూయార్క్‌లోని బ్రూక్‌లీన్‌లో 17 అంతస్తుల అపార్ట్‌మెంట్‌లో ఒంటరిగా నివసిస్తూ తనను చక్రాల కుర్చీలో ఎత్తైన ప్రదేశాలకు తీసుకు వెళ్తున్నప్పుడు ఎక్కడ క్రింద పడిపోతానో, ఆ విధంగా జరిగితే ప్లాస్టిక్ సర్జరీ క్యాంప్‌లో తుదిశ్వాస విడిచే భాగ్యం కరువవుతుందేమోనని భయం కల్గుతుంది అంటుంటారు.

సేవాతత్పరునిగా, గొప్పవైద్యశిఖామణిగా మహోన్నత శిఖరాలను అందుకున్న తరుణంలో విధిఆడిన వింత నాటకంలో భాగంగా ఎన్నో శారీరక, మానసిక ఒత్తిడులను ఎదుర్కొన్నప్పటికీ తాను నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలను నిర్లక్ష్యం చేయక, భగవంతునిమీద విశ్వాసాన్ని సడలింపక సుస్వరం మూగబోయినా కత్తెరలను, సూదులను నాట్యం

చేయించగల చేయి సహకరించక పోయినా, తన కాళ్ళమీద తాను నిలువలేకపోయినా, శరీరంలో అతిముఖ్యమైన గుండె సహితం పనిచేయక మొరాయించినా తాను నిర్వహిస్తున్న ఉచిత వైద్యశిబిరాలను అప్రతిహతంగా కొనసాగిస్తున్న ఆయన వ్యక్తిత్వం అసాధారణం, అద్వితీయం. కనీసం మామూలు ఆహారముకూడా తీసుకోవడానికి సహకరించని గొంతువలన యాంత్రికంగా అమర్చబడిన గొట్టంద్వారా ఒక కప్పు పాలు, అరటిపండు గుజ్జుతోపాటు ఒక కప్పు మందులను మాత్రమే సేవిస్తూ తన దేహనిమిత్తం, తన నిమిత్తం ఎంత సమయం వెచ్చించినా అది కాలము వృధాగా భావించి ఆ సమయంలో మరికొందరు అనాధలకు సేవచేయాలనే డాక్టర్ దీక్షిత్ ఆకాంక్ష ఎందరికో స్ఫూర్తి దాయకం, ఆచరణీయం.

1984లో డా॥ దీక్షిత్ ఆరోగ్య స్థితిని గమనించిన డాక్టర్లు ఇక ఆరునెలలకంటే బ్రతకరు అని తీర్మానించి నప్పటికీ తరువాత రెండుసార్లు గుండెపోటుకు గురైనప్పటికీ మొక్కవోని గుండె నిబ్బరంతో, సంకల్పబలంతో ఔరంగాబాద్, ఎల్లోరాలోని ఘృష్మేశ్వర్‌లోని జ్యోతిర్లింగం చిత్తరువును తన భౌతిక హృదయానికి దగ్గరగా ఉంచుకుంటూ తన హృదయస్పందన చేయించేది ఆ ఈశ్వరుడే అనే విశ్వాసంతో ఇన్ని సంవత్సరాల సేవాభరిత జీవనయాత్రను సాగిస్తున్నారు డా॥ దీక్షిత్.

మహాత్ములు ఏ యుగానికో, ఏ తరానికో పరిమితంగా జన్మించరు. అందరికీ ఆదర్శప్రాయులుగా, స్ఫూర్తి ప్రదాతలుగా ప్రతితరంలో ఉద్భవిస్తూనే వుంటారు అనటానికి నేటి తరానికి సజీవ తార్కాణం డా॥ శరద్ కుమార్ దీక్షిత్.

(The Week ఆంగ్ల వారపత్రిక ఆధారంగా)



## సాయినాధుని పాదము

సాయినాధుని పాదము
పాపము తొలగించు పాదము ॥ సా ॥

పర్తిపురీశుని పాదము
ఈశ్వరాంబసుత పాదము
నాగేంద్రశయనుని పాదము
తేజస్వరూపుని పాదము ॥ సా ॥

ప్రేమావతారుని పాదము
పూర్ణావతారుని పాదము
ప్రశాంతి నిలయుని పాదము
మహిమాన్వితమూర్తి పాదము ॥ సా ॥

సూక్ష్మస్వరూపుని పాదము
దీనజనరక్షకుని పాదము
భక్తలోలుని పాదము
మధురగాయకుని పాదము ॥ సా ॥

ధర్మరక్షకుని పాదము
సనాతన సారధి పాదము
సత్యస్వరూపుని పాదము
శక్తి స్వరూపుని పాదము ॥ సా ॥

ఆపద్బాంధవుని పాదము
పీతాంబరధరుని పాదము
సిద్ధిప్రదాయి పాదము
కర్మధ్వంసి పాదము ॥ సా ॥

భస్మోద్భవకరుని పాదము
లింగోద్భవకరుని పాదము
సర్వమత ప్రియుని పాదము
సర్వధర్మప్రియుని పాదము ॥ సా ॥

జయసాయిరాముని పాదము
జయసాయికృష్ణుని పాదము
ప్రత్యక్ష భగవానుని పాదము
మోక్షమువిచ్చెడి పాదము ॥ సా ॥

ఆపాదదర్శన భాగ్యము
ఆపాద స్పర్శభాగ్యము
ఆపాద పూజ భాగ్యము
ఎన్నటికి కలుగునో ఆ భాగ్యము ॥ సా ॥

- ఎస్.వి. రామారావు, పుట్టపర్తి

# దేశ క్షేమమే దేహక్షేమము

"శుద్ధోఽసి శక్త్యోఽసి నిరంజనోఽసి
సంసారమాయ త్యజమోహ నిద్రా"

ప్రేమస్వరూపులారా!

"రక్తము మాంస శల్యముల దేహము మీరుకాదు
సువ్యక్తముగాని కోరికల వ్యర్థ మనస్సు మీరుకాదు
ముక్తికి మోహకారమగు భ్రాంతియు మీరుకాదు
మీ శక్తిని మిమ్మెరుంగగల శాశ్వతమౌ పరమాత్మ నీవెగా!"

ప్రేమస్వరూపులారా!

నేటి యువకులే భావిభారత నేతలు, నవసమాజ నిర్మాతలు. భావినేతలపైననే భవిష్యత్తు భారతం ఆధారపడి ఉన్నది. దేశభక్తియే యువకుల లక్ష్యం. సమాజసేవలే యువకుల కర్తవ్యము. శారీరక మానసిక శక్తులే దేశ సముద్ధరణకు మూలము.

యువకులారా!

ఇది నిద్రించవలసిన సమయంకాదు. దేశ సేవకు కంకణధారులుకాండి. సంకుచితభావములను త్యజించండి. విశాలభావములను పెంచుకోండి. దివ్యమైన, నవ్యమైన దేశముయొక్క కీర్తి మీ హృదయాలలో నింపుకోండి. మానవ జన్మ దేని నిమిత్తమై మనకు భగవంతుడు ప్రసాదించాడో గుర్తించాలి. ప్రతిజీవికి ఒక లక్ష్యమున్నది, ఒక గమ్యమున్నది. దానిని విస్మరించి, జీవితమును వ్యర్థం గావించుకోవటం యువకుల కర్తవ్యం కాదు. సేవ జీవితలక్ష్యం కావాలి. శీలతత్వము మానవత్వలక్షణం కావాలి. ప్రాచీన భారతీయ సంస్కృతిని అభివృద్ధి పరచే నిమిత్తమై, ఆచరణ రూపమైన ప్రచారం చేత చరిత్రను సృష్టించాలి. ఈనాటి విద్యార్థులు తమ కర్తవ్యమును విస్మరిస్తున్నారు. దేశము యొక్క ఉన్నత స్థితిని గురించి వారు ఏమాత్రం పట్టించుకోవటం లేదు. దేశక్షేమమే, దేహక్షేమమనే సత్యమును గుర్తించాలి. మానవత్వం మహా పవిత్రమైనదనే సత్యమును విస్మరించ రాదు. కేవలం అన్న నిమిత్తమైగాక ధర్మ నిమిత్తమై మనం బ్రతకాలి. పశుపక్షి మృగాదులు కూడా ఆహారం తిని తమ కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాయి. కాని మానవుడు తన ధర్మమును విస్మరిస్తున్నాడు. చదువులు కేవలం ఉద్యోగ నిమిత్తమేనని భావిస్తున్నారు. అది చాలా పెద్ద పొరపాటు. యోగములేని ఉద్యోగము నిరుపయోగము. యోగమే దైవముయొక్క చింతన. అదియే మానవ కర్తవ్యం. అదియే ప్రధానమైన ఉద్యోగము. కాని ఈనాడు మనం చేసే ఉద్యోగమే గొప్పదని గర్విస్తున్నారు. జీవితమనే వృక్షమునకు అహంకారమే ఒక వేరుపురుగు. రాగద్వేషములే దీనికి సహాయకారులు. ఈ మూడింటి యొక్క సమ్మిళితం వలననే మానవత్వం క్రమక్రమేణ అణగారిపోతున్నది. అసలు మానవత్వాన్నే నిర్మూలనం గావిస్తున్నది. ఏ మానవుని యొక్క మనసు భగవంతుని ప్రేమపైన ప్రసరించునో, అట్టి మానవజీవితమే కళకళలాడుతూ,

## భగవాన్ సాయి దివ్యబోధ

కిలకిల నవ్వుతూ ఉంటుంది. అటులకాక మానవుడు భగవంతుని విస్మరించి, స్వార్థంతో జీవించుతే తన జీవితం విలవిలలాడుతూ మలమలమాడుతుంది. ఎవరు భగవంతుని విశ్వసిస్తారో, ఎవరు భగవంతుని, ప్రేమిస్తారో, అట్టివారి జీవితం కళకళలాడుతూ కిలకిల నవ్వుతూ వుంటుంది. కనుక మానవత్వంలో వున్నటువంటి నిజమైన శక్తిని గుర్తించడానికి ప్రయత్నించాలి. మానవుని యందున్న దివ్యశక్తి ఇట్టిది, అట్టిది అని వర్ణించడానికి వీలుకానటు వంటిది. అది విష్ణుశక్తి, అదే సర్వశక్తి, అదే సర్వస్వమైన బ్రహ్మశక్తి.

'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అన్నది వేదం. భరత దేశంబు వేదాల పట్టుకొమ్మ. యజ్ఞయాగాది క్రతువులకు ఆటపట్టు. ఇట్టి యజ్ఞ యాగాది క్రతువులకు ఆటపట్టు అయిన భారతదేశము, పవిత్రమైన వేదములకు పుణ్యక్షేత్రమైన భారతదేశము ఈనాడు వేదనపడటానికి మూలకారణమేమిటి? ప్రాచీన కాలమున మానవులు 'సత్యమే ధర్మము, త్యాగమే ప్రేమ'అని విశ్వసించి, ఆచరించి ఆనాటివారు, ఆకాలమునందు ఎంతగానో ఆనందమును అనుభవించారు. అయితే ఈనాటివారు 'ధనమే దైవము, అధికారమే ఆనందము' అని భ్రమిస్తున్నారు. నీ ధర్మము

అదా? కాదు..కాదు... మనం నిరంతరం ఆనందమును అనుభవించాలి. అయితే ఈ మూడు కాలములయందు మారనటువంటిది, చలించనటువంటి జ్ఞానమును ప్రబోధించేటటువంటిదే నిజమైనటువంటి బ్రహ్మతత్వము. కనుకనే దీనిని వేదమునందు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని పిలువబడింది. దీనినే Constant Integrated Awareness అన్నారు. మార్పు చెందనటువంటిది, కూర్పులేనటువంటిది, చలించనటువంటిది, మూడుకాలముల యందు ఏకస్వరూపాన్ని ధరించినటువంటిది. అట్టి జ్ఞానమునే 'బ్రహ్మ'గా భావిస్తూ వచ్చారు. ఈ బ్రహ్మనుండియే ఆకాశము ఆవిర్భవించింది. ఆకాశమునుండియే వాయువు వచ్చింది. వాయువునుండియే జలము వచ్చింది. జలమునుండియే అగ్ని వచ్చింది. ఈ అగ్నినుండియే పృథ్వి వచ్చింది. పృథ్వి నుండియే ఔషధులు ప్రారంభమైనాయి. ఔషధులనుండియే అన్నము ఆవిర్భవించింది. అన్నమునుండి పురుషుడు పుట్టాడు. కనుక ఈనాటి మానవునకు, బ్రహ్మకు వుండినటువంటి సంబంధ బాంధవ్యము ఏమిటి? విచారిస్తే ఈనాటి మానవునకు బ్రహ్మకు సంబంధ బాంధవ్యమున్నదనే విషయం స్పష్టమవుతున్నది. కనుకనే బ్రహ్మ **"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః"** అన్నాడు. మీరందరూ నా అంశయే అన్నాడు. కనుక బ్రహ్మయే లేకపోతే ఈ పంచ భూతములే లేవు. ఔషధులే వుండవు. ఔషధుల పంటయే లేకపోతే అన్నము మనకు లభించదు. అన్నమే లేకపోతే మానవులకు మనుగడేలేదు. దీనిని పురస్కరించుకొనియే వేదమునందు **'అన్నం బ్రహ్మ'** అన్నారు.

అసలు అన్నం అంటే ఏమిటి? కేవలం భుజించే పదార్థములే అన్నమా? కాదు..కాదు.. ప్రపంచమంతా అన్నమయమే. అన్నీ ఆహార స్వరూపములే. కనుక బ్రహ్మనే అన్నమయం. (Food is God) అందరికీ ఆహారమయం బ్రహ్మనే. అట్టి బ్రహ్మను నీయందుంచుకొని, బయటవున్న అన్నమునకు మాత్రమే ప్రార్థన చేస్తున్నాము. ఏమని ప్రార్థన చేస్తున్నాం? 'బ్రహ్మార్పణం' అని ప్రార్థన చేస్తున్నాం. కాని ఎక్కడ ఉన్నాడు బ్రహ్మ? లోపలనుంచి వస్తున్నది జవాబు. 'అహం వైశ్వానరో భూత్వా' నేనే వైశ్వానరుడుగా నీలో ఉన్నాను నాయనా! నీవు భుజించేటటువంటి ఆహారమును జీర్ణించేట్లుగా చేసేవాడిని నేనే! నీకంటే నేను వేరుకాదు. కనుక అన్నము యొక్క స్వరూపాన్ని మనం విచారణ చేసినప్పుడు, అన్నమును భుజించే ఆహారముగా భావిస్తున్నాము. ఒక ఆహారమును భుజించిన జంతువు, మరొక ఆహారమును భుజించిన జంతువును తింటున్నది. కనుక భుజించేది అన్నమే. భుజింపబడేటటువంటిది అన్నమే. సంపాదించేది అన్నమే. వినియోగం చేసేదీ అన్నమే కనుకనే 'అన్నం బ్రహ్మ' అన్నారు. దీనికి 'సత్యం' చాలా ప్రధానమన్నారు.

ఈ సత్యం అంటే ఏమిటి? అన్నమును సృష్టించేదే ఈ సత్యము. సత్ + ఇ + యంః = సత్యం. 'సత్' అనగా జీవుడు. 'ఇ' అనగా అన్నం. 'యం' అనగా సూర్యుడు. కనుక ఈ జీవునకు అన్నమును అందించాలంటే సూర్యరశ్మి కావాలి. ఈ సూర్యుని చేతనే ఈ ఆహార పదార్థములు లభ్యమవుతున్నాయి. ఈ ఆహారపదార్థముల చేతనే ఈ 'జీవి' జీవిస్తున్నాడు. కనుక ఈ 'సత్యం' అన్నింటికీ మూలాధారము. కనుక మన ప్రాచీనులు **'సత్యమే ప్రాణం'గా భావించారు. ధర్మమే మన శ్వాసము. ప్రాణశ్వాసముల రెండింటి ఏకమే జీవితము.** కనుకనే సత్యం ప్రాణం, సత్యం బ్రహ్మ అని విశ్వసించారు. అయితే మనం ఇలాంటి సత్యమును విస్మరిస్తున్నాం. అన్నాన్ని ఆశిస్తున్నాం. కాని సత్యం లేకుండా అన్నం లభించదు. అన్నింటికీ మూలం 'బ్రహ్మ'.

'బ్రహ్మ' అనగా ఏమిటి? బృహత్తరమైన శక్తి. సర్వత్రావ్యాపించినటువంటి శక్తి. పంచభూతములు బ్రహ్మ స్వరూపమే. అయితే మనం ఈనాడు పంచభూతములను విడివిడిగా ప్రార్థిస్తున్నాం. వాయుదేవుడంటున్నాం. అగ్ని దేవుడంటున్నాం. అదే విధంగా మిగతా పంచభూతములను విడివిడిగా ప్రార్థిస్తున్నాం. ఇది ఎంత వెర్రితనం? ఈ పంచభూతములు ఉన్నవి ఒక్క దేహమునందే. పంచ

భూతముల సంబంధమే ఈ పంచప్రాణముల స్వరూపము. కనుక మానవుని కంటే మరొక దేవుడు ప్రత్యేకంగా లేడు. మానవుడే సాక్షాత్ బ్రహ్మ స్వరూపుడు. మానవుడే సత్యస్వరూపుడు. పంచభూతముల సమ్మిళిత స్వరూపమే మానవత్వము. ఈ మానవత్వమునందే దైవత్వమనేది ప్రకటించాలి. ఆ ప్రకటింప జేసేటటువంటి ప్రయత్నమే, మానవుని సాధన. కనుక ఈ పంచ భూతములే లేకపోతే మానవజీవితమే లేదు. ఈ భూతములే బ్రహ్మ. కనుక ఈ 'బ్రహ్మ' అనేటటువంటిది సర్వత్రా వ్యాపించినటు వంటిది.

మనం చిత్రమును చూచి బ్రహ్మ చతుర్ముఖుడు అని భావిస్తున్నాం. అవి చిత్రములు మాత్రమే.

"చిత్రంబులు త్రైలోక్య పవిత్రంబులు
భవలతాలవిత్రంబులు సన్మిత్రంబులు
మునిజన వన చైత్రంబులు
విష్ణు దేవుని చారిత్రంబులు"

ప్రతి మానవుడు విష్ణుస్వరూపుడే. కనుక ప్రతి మానవుడు తనయందున్న దివ్యశక్తిని గుర్తించడానికి ప్రయత్నించాలి.

ఈనాడు పిల్లలు అనేక ఆటలు ఆడారు. అనేక విజయాలు సాధించారు. కాని "నేను సాధించాను.... నేను సాధించాను..." అని గర్విస్తున్నారు. కాదు. కాదు. వారి వెనుకనున్న దివ్యత్వమే వీరి చేత ఇన్ని ఆటలు ఆడించింది. ఏనాడూ పాటలు రానటువంటి పిల్లలు ఈనాడు పాటలు పాడుతున్నారు. ఇవి ఎక్కడ నుంచి వచ్చాయి? తమ యందే యిమిడి ఉన్నాయి. అయితే తాము గుర్తించడానికి ప్రయత్నించలేదు. ఎన్నడూ ఆడనటువంటి ఆటలు ఆడి విజయాలను సాధిస్తున్నారు. అవి ఎక్కడ నుంచి వచ్చాయి? అన్నీ తమనుంచే వచ్చాయి. Reflection of the Inner Being. అసలు ఆ లోపల నివసించేవాడు ఎవడు? అతనే బ్రహ్మ. ఏరూపంలో మనకు గోచరిస్తున్నాడు? సో2హం... సో2హం... అనే రూపంలో బోధిస్తున్నాడు. ఈ 'సో2హం' అనగా ఏమిటి? నేనే దైవము. దీనినే హంసగాయిత్రి అంటారు. ప్రతి ఒక్కరు 24గంటలలో 21,600 సార్లు "సో2హం.. సో2హం" నేనే బ్రహ్మ.. నేనేబ్రహ్మ, అని ఉచ్చరిస్తుంటారు. ఇలాంటి సర్వశక్తులతో కూడినటువంటి మానవుణ్ణి ఎందుకు అల్పంగా భావించాలి? నేను శక్తి హీనుడనని నీవు ఎందుకు తలంచాలి? సర్వశక్తిమయుడవు నీవే. సర్వ విజ్ఞానమయుడవూ నీవే. ఈ విజ్ఞానమంతా చదువుకుంటే వచ్చిందని అనుకుంటున్నావు. కాదు. కాదు. చదువు గ్రంధములలో ఉన్నది కాని విజ్ఞానం నీలో ఉంటున్నది. నీయందున్నటువంటి గ్రంధము యొక్క తత్త్వమే, 'ప్రకృతి' అనే గ్రంధంలో నిరూపిస్తున్నది. ప్రతిబింబిస్తున్నది. నీయందే ఆ విజ్ఞానమే గనుక లేకపోతే, గ్రంధములను ఏవిధంగా చదువగలవు? వీటన్నింటికి ఆధారభూతుడైనవాడు ఒకడున్నాడు. పూలు, సూది, దారముంది. పుష్పమాల తానగునా? కుట్టేవాడు ఒకడుండాలి. అతనే దీనికి నాయకుడు. అదే విధంగా అక్షరములు విడివిడిగా ఉన్నాయి, కాని ఏ ఏ అక్షరములు చేర్చినప్పుడు ఏ పదం ఏర్పడుతుందో, ఏవిధంగా ఏర్పడుతుందో! అది ఎవరు చేస్తున్నారు? G. O D 'గాడ్' అని చదువుతున్నావు. ఈ అక్షరములు విడివిడిగా వున్నాయి. అయితే ఈమూడు అక్షరములు ఒకచోట చేర్చి 'గాడ్' అని పలికినవాడెవడు? నీవే. నీ యందు అసంఖ్యాకమైన శక్తి యిమిడి ఉంటున్నది. పెరుగు ఉన్నది. కవ్వం ఉన్నది కాని వెన్న నీకు లభిస్తుందా? కవ్వంతో చిలకాలి. అప్పుడే ఆ పెరుగు నుండి నీకు వెన్న లభిస్తుంది. చిలకకుండా లభించదు. కనుక మానవ ప్రయత్నం ఉన్నప్పుడే అఖండమైన ఫలితాన్ని సాధించ వచ్చును. ప్రయత్నం లేకుండా దేనినీ సాధించలేము. అయితే మనము అది ఎప్పుడు సాధించగలం? భగవత్ ప్రేమ వరకు మన మనసును ప్రయాణం చేయించాలి. అయితే ఈనాడు మీరు ఎందుకు చింతిస్తున్నారు? ఎందుకు విచారిస్తున్నారు? కారణం ఏమిటి? మీ మనసు భగవంతుని ప్రేమ వరకు ప్రయాణం చేయలేదన్న మాట. భగవంతుని ప్రేమ వరకు నీ మనసు ప్రయాణించినప్పుడు నీవు కిలకిల నవ్వుతావు, కళకళలాడుతావు.

నేను ఉద్యోగం చేస్తున్నాను. యోగం చేయటంలేదని బాధ పడుతుంటావు. కాని ఉద్యోగమును కూడా 'యోగం' గా భావించి నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు. Do Your Duty Sincerely. అప్పుడే అది యోగంగా మారుతుంది. అయితే అట్టి భావం ఈనాడు ఎవరియందు కనిపించటం లేదు. ఇది నాపని, ఇది నీపని అంటారు. బయటివారు ఎవరూలేరు. అందరూ ఒక్కటే **"ఏకం సత్ విప్రాబహుధా వదంతి"** సత్యం ఒక్కటే. **"సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్ష స్సహస్రపాత్."** అనేక శిరములతో, అనేక చేతులతో అన్ని పాదములు తనవే. ఈ విశ్వమంతా విరాట్ స్వరూపమే. కనుక భగవంతుడు లేని వ్యక్తి కానరాడు. నాస్తికుడియందు కూడా దైవత్వం ఉంటున్నది.

ఈ నాస్తికత్వం ఎక్కడ నుంచి వచ్చింది? న + ఆస్తి = నాస్తి. 'ఆస్తి' అనగా దైవత్వమే. ఈ దైవత్వానికి 'న' చేర్చినప్పుడే 'నాస్తికుడు' అయిపోయినాడు. కాని వాడు నిజంగా 'నాస్తికుడు' కాదు. అతనిలో 'ఆస్తి' చేరి ఉంటున్నది 'ఆస్తి' లేకుండా నాస్తికుడు కావటానికి వీలులేదు. ఇలాంటి అర్థహితంకాని పదముల చేతనే మానవుడు కేవలం అజ్ఞాన స్వరూపాన్ని పొందుతున్నాడు. ప్రతి పదమునకు ఒక పెద్ద అర్థం ఉంటుంది అంతరార్థం కూడా ఉంటుంది అయితే ఈనాడు చాలామందికి అర్థమే తెలియటంలేదు అంతరార్థములు అసలే అర్థం కావటం లేదు. దైవం సర్వవ్యాపకుడు. సర్వజ్ఞుడు, సర్వశక్తివంతుడు. కనుకనే 'సత్యం జ్ఞానం, అనంతం బ్రహ్మ' అన్నది వేదం. అనంతమైన జ్ఞానం ఎక్కడనుంచి వస్తున్నది? మానవుని నుండియే ఆవిర్భవిస్తున్నది. ఇది మానవుని నుండి ఆవిర్భవించకున్నచో, అనంతమైన శక్తియేలేదు.

ఈనాటి మానవులు చాలా బలహీనులైపోతున్నారు. కారణమేమిటి? తమ ఆహార విహారములచేతనే ఇంత బలహీనులైపోతున్నారు. ఆహారం పుష్టిగానే భుజిస్తున్నాడు. నేను బ్రహ్మానందంగానే ఉంటున్నామంటాడు. ఏమిటి ఈ బ్రహ్మానందం? దీనిని చక్కగా గుర్తించాలి. శారీరక సర్వ సౌఖ్యములు, సంతోషములు, సదుపాయంగా వుండినప్పుడు, ఇది 'మానవానందం' అంటారు. ఈ మానవానందానికి వందరెట్లే దేహానందం అంటారు. ఈ దేహానందానికి వందరెట్లే 'పృథ్వీ ఆనందం' అంటారు. ఈ పృథ్వీ ఆనందానికి వందరెట్లున్నప్పుడు దీనిని బృహస్పతి ఆనందం అంటారు. నూరు రెట్లు ఈ బృహస్పతి ఆనందానికి అధికమైనప్పుడు దానిని "దైవానందం" అంటారు. ఈ దైవానందం, ప్రజాపతి ఆనందమునకు తోడైనటువంటిది. అనగా ప్రజలకు పతి దైవత్వమే. ఆ ప్రజాపతి ఆనందమే నిజమైనటువంటి 'బ్రహ్మానందం'. అప్పటికప్పుడు వచ్చిపోయేటటువంటిది 'బ్రహ్మానందం' కాదు. ఎప్పటికి నీలోవుండేటటువంటిది ఈ **'బ్రహ్మానందం'** అయితే దీనిని ఈనాడు మరచిపోతున్నాం. **'బ్రహ్మానందం పరమసుఖదం'** అదియే నిజమైన సుఖమును అందించేటటు వంటిది దేహసుఖం నిజమైన సుఖం కాదు. ఇది కదిలిపోయే మేఘముల వంటిది. కదలని, మెదలనటువంటి నిత్యమైన, సత్యమైన ఆనందం 'బ్రహ్మానందం' ఒక్కటే. దీనిని స్వప్నమందు, నిద్రయందు, జాగ్రత్తయందు చూడవచ్చును, అనుభవించవచ్చును.

మానవుడు ఆనందపిపాసి. ఆనందపిపాసి అయినటు వంటి మానవుడు ఎందుకు చింతించాలి? తుచ్ఛమైన భావములు తనయందు వుండటంచేతనే 'చింత'కు మూల కారణమైంది. అల్పభావములు వుండటం చేతనే మానవుడు దుఃఖిస్తున్నాడు. కనుక ఈ అల్పభావములను, స్వల్ప భావములను త్యజించాలి. విశాలమైన, అనంతభావము లను పెంచుకోవాలి. అప్పుడే నీవు నిరంతర ఆనంద స్వరూపుడవైపోతావు.

ప్రేమస్వరూపులారా!

ప్రేమచేతనే ఈ ఆనందం మనకు లభ్యమవుతుంది. ఈ ప్రేమచేతనే అన్నివిధములైన సుఖములను పొందగలం. **ప్రేమ కంటే మించిన ఆనందం, ఆనందం కంటే మించిన ప్రేమ మరొకటిలేదు, కనుకనే** 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అంతరార్థం ఇదే మూడు కాలముల యందు మార్పు చెందనటువంటి జ్ఞానమే 'బ్రహ్మము'. అలాంటి నిత్యమైనటువంటి దైవతత్త్వము నీయందే ఉంటున్నది. కనుక దేహాభిమానమును త్యజించు! ఆత్మాభిమానమును వరించు! అప్పుడే నీవు నిజమైనటువంటి దైవత్వాన్ని పొందగలుగుతావు.

ఈనాడు దేహాభిమానం పెరిగిపోతున్నది. అసలు ఈ దేహము యొక్క పరిస్థితి ఏమిటి? ఎక్కడ నుంచి వచ్చింది? ఎప్పుడు వచ్చింది? ఎప్పుడు పోతుంది? ఎక్కడకుపోతుంది? ఎవ్వరికీ తెలియదు. వస్తుంది, పోతుంది. ఇది కేవలం ఒక విధమైన స్వప్నంవంటిదే. కనుక దేహాభిమానమును అధికంగా పెంచుకోకూడదు. ఉన్నంత వరకు క్షేమంగా ఉండాలి. పరాధీనం కాకుండా ఉండాలి.

## సుభాషితవాణి

"మృత్పిండమేకో బహు భాండరూపం
సువర్ణమేకం బహుభూషణాని,
గోక్షీరమేకం బహుధేను జాతం
ఏకః పరాత్మా బహు దేహవర్తీ."

కుండలు వేరైనా వాటిలోవున్న మన్ను ఒక్కటే. సొమ్ములు వేరైనా వాటిలో ఉన్న సువర్ణం ఒక్కటే. ఆవులు వేరైనను అవియిచ్చే పాలుఒక్కటే. అనగా ఆవుల రంగులు వేరువేరైనా అవి యిచ్చే పాలు అన్నీ తెల్లగానే ఉంటాయి. అలాగే శరీరాలు వేరువేరుగాఉన్నా, వాటిల్లో ఉన్న పరమాత్మ ఒక్కడే.

మనపనులు సక్రమంగా చేయాలి. ఈ చేసేపనులలో ఎట్టి దోషం లేకుండా చూచుకోవాలి. అలాంటి దివ్యమైన భావాన్ని పెంచుకున్నప్పుడు మానవుడు దేవుడవుతాడు. మీరు సర్వ శక్తివంతులైనా కూడా, ఈ అల్పభావములకు ఎందుకు ఆ స్థానం ఇస్తున్నారు?

ఈనాడు దేశములో అనేక కష్టములు, నష్టములు, దుర్మార్గములు జరుగుతూ వున్నాయి. అనిత్యమైన బాధలకు మనం గురిఅవుతున్నాం. కనుక ఇలాంటి అన్యాయ, అక్రమ, అనాచారములను రూపుమాపాలి. ఎలా రూపు మాపాలి? వాటితో యుద్ధం చేయుటమా? కాదు.. కాదు.. పవిత్రమైన భావములు నీలో అభివృద్ధి పరచుకో. న్యాయం, ధర్మం, సత్యం అనేవాటిని పెంచుకో.

విద్యార్థులారా!

భావిభారతోద్ధారకులు మీరే! నవభారతమును మీరు నిర్మించాలి దీనికి కంకణం కట్టుకోండి అదియే మీరు నేర్చవలసిన నిజమైన విద్య. ఈ లోకవిద్యలన్నీ గ్రంథముల ద్వారా వచ్చినటువంటివి. ఈ లౌకిక చదువులు తాత్కాలికంగా జీవన భృతికి మాత్రమే ఉపయోగపడు తున్నాయి. దైవాన్ని ఆశ్రయించండి, విశ్వసించండి. ఏకార్యములో ప్రవేశించినా, సర్వఫలములు లభిస్తాయి. చదువుకోసమే మీరు చదువకూడదు, కేవలం చదువు వలనే జ్ఞానంరాదు.

"చదువులన్నియు చదివి చాల వివేకియై
మదిని తన్నెఱుగడు మందమతుడు
ఎంత చదువు చదివి ఏరీతి నున్నను
హీనుడవగుణంబు మానలేడు."

"తరచి చదువు చదవ తర్కవాదమెకాని
పూర్ణ జ్ఞానమెపుడు పొందలేడు
చదువు చదివి ఒచివి చావంగ నేటికి
చావులేని చదువు చదువవలయు."

అదియే నిజమైనటువంటి చదువు. అదియే చావులేని చదువు. అదియే బ్రహ్మజ్ఞానము, దైవము సర్వత్రా ఉన్నాడనే జ్ఞానము సంపాదించుకుంటే, ఇంతకంటే గొప్పజ్ఞానం మరొకటిలేదు. భౌతిక, లౌకిక, ఆధ్యాత్మిక సుఖములన్నియూ అందులోనే లభిస్తాయి అయితే భౌతిక చదువులు కూడా చదువవలసిందే. దానికి ఎంతవరకో, అంతవరకే స్థానం ఇవ్వాలి. మితిమీరిపోతే మతి చెడిపోతుంది. ప్రతి దానికి ఒక Limit (హద్దు) ఉండాలి. సంపాదనకు ఒక Limit (హద్దు) ఉండాలి, వినియోగానికి ఒక Limit (హద్దు) ఉండాలి. భుజించడానికి, త్యజించ డానికి కూడా ఒక limit (హద్దు) ఉండాలి. అప్పుడే మనజీవితం ఆనందంగా ఉంటుంది. అదే విధంగా మీకు ఆటలు, పాటలు కూడా అవసరమే. భౌతిక దేహమునకు కసరత్తు కూడా ఒక విధమైన శక్తియే. కండరములను పెంచు తుంది, నరాలను అభివృద్ధి పరుస్తుంది. తెలివితేటలను కూడా పోషిస్తుంది దేనికోసం? సమాజసేవ చేయటానికి. సేవచేయనటువంటి దేహం వుండి ప్రయోజనం ఏమిటి? ఇదిమంచిది, అది చెడ్డది అనే విచక్షణా జ్ఞానం (Discrimination Power) కావాలి. ఇది శరీరశక్తి నుండియే మనకు లభిస్తుంది.

ప్రేమస్వరూపులారా!

మీ ప్రేమను కూడా పెంచుకోండి, కేవలం లౌకికమైన విద్యలలోనే మీ జీవితాలను అంకితం చేయకండి. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులు మూడూ కూడా దైవత్వానికి అర్పితం కావాలి. ఇచ్చినవాడు తానే, పుచ్చుకొనేది తానే. అనుభవించేది తానే, అనుభవింపబడేటటువంటివాడూ తానే. కనుక మంచిగాని, చెడ్డగాని అంతా దైవ సంకల్పమే. ఆ సత్యమును మీరు మొట్టమొదట విశ్వసించండి.

ఏదో గొప్ప చదువులు చదివాముని, దేశాలు వెళ్ళు తున్నామని, విదేశాలలో గొప్పగా సంపాదించి వస్తామని భ్రమించకండి. ఆ సంపాదన నీయందే ఉంటున్నది. నీ దేశమునందే ఉంటున్నది. దేశాభిమానమును మాత్రం మరువకండి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్నాడు రాముడు. నాజన్మభూమియే నాతల్లి. నాతల్లి కురూపి కావచ్చును. కాని అందంగా వున్నదని మరొక ఆమెను 'తల్లి' అని పిలుస్తామా? అదే విధంగా నా కన్నతల్లి, కన్న దేశము నాకు స్వర్గము. ఈ దేశాభిమానాన్ని మనం మరువకూడదు. ఏదేశం వారైనా సరే, వారి దేశం మీద అభిమానాన్ని పెట్టుకోవాలి. **దేశాభిమానాన్ని పెట్టుకోండి కాని దేహాభిమానాన్ని మాత్రం పెట్టుకోకూడదు.**

Imitation is Weakness, Creation is Divine. ఆ సత్యమును గుర్తించండి. అయితే ఈనాడు Imitation (అనుకరణ) ఎక్కువైంది. ఇది తప్పు. విద్య విషయంలో కొంత Imitation చేయవచ్చును. కాని మిగతా విషయాలలో ఏమాత్రం పనికిరాదు. Imitation పనికిరాదు. Limitation పనికిరాదు, కనుక మనం Creation చేయాలి. నీవే Creator సర్వసంకల్పములూ నీ నుండియే ఆవిర్భవిస్తున్నాయి. పవిత్రమైన సంకల్పములు నీవు Create చేసుకో. సర్వమూ

పవిత్ర ఫలములే వస్తుంటాయి అల్పభావములు నీవు Create చేసుకుంటే, అల్ప ఫలితాలే వస్తుంటాయి.

విద్యార్థులారా!

మీ ఆటలు పాటలు అందరినీ ఆనందపరిచాయి. క్షణం క్షణం జీవితమనేది ఒక ఆట (Game) దానిని సాధిస్తూరావాలి, విజయాన్ని పొందుతూరావాలి. Life is A Long Journey, Not Shortcut కనుక మనం బ్రతికినంతవరకు ఈ ఆటలు ఆడవలసిందే, పాటలు పాడవలసిందే, అనుభవించవలసిందే ఈ ఆనందం, జీవించవలసిందే ఈ జీవితం. జీవితం విలువైనటువంటిది, ఘనమైనటువంటిది, ఫలప్రదమైనటువంటిది. అలాంటి జీవితమును వ్యర్థం చేయరాదు. Time Waste is Life Waste కనుక మీరు సత్కర్మలలో పాల్గొనండి సమాజ సేవలో భాగం వహించండి. తోటి మానవుల కళ్యాణమును ఆశించండి. తోటి మానవులకు సహాయం చేయండి, Help Ever, Hurt Never. ఇదే మహా భారతము యొక్క సారాంశం. **'పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్'** దీని అంతరార్థంకూడా అదే. కౌరవులు ఎప్పుడూ ఇతరులను బాధిస్తూనే (Hurt) వచ్చారు. దీని వలన కట్టకడపటికి నూర్గురిలో ఒక్కరుకూడా లేకుండాపోయారు. కాని పాండవులు ధర్మాన్ని అనుసరించడం వలన, దైవాన్ని విశ్వసించటం వలన విజయాన్ని సాధించారు.

మీరందరూ విద్యార్థులు. భావిభారతనేతలు మీరు. ఇలాంటి నేతలైన మీరు జీవితాన్ని వృధా చేసుకోకూడదు. మొట్టమొదట తల్లి దండ్రులను ప్రేమించండి. వారి ఇష్టమునను సరించండి. దైవమును విశ్వసించండి. వారి యందు కూడా వున్నది దైవమే. అందువలననే **మాతృదేవోభవ! పితృదేవోభవ!** అన్నారు. వారిరువురూ దేవతలే. వారిని ఏమాత్రం బాధించవద్దు. సాధ్యమైనంత వరకు వారిని సంతృప్తి పరచండి. ఏది చేసినా దైవ కార్యంగా భావించి చేయండి. తప్పక విజయాన్ని పొందుతారు. ఆటలు, పాటలు ద్వారా మీరు ఎన్నో వేలమందికి ఆనందాన్ని అందించి సంతోషపెట్టారు. ఇంతమందికి ఆనందాన్ని అందించిన మీకు ఆనందం లేకుండా పోదు. అయితే విశ్వమంతా ఆనందించినప్పటికీ, దైవాన్ని ఆనంద పరచకపోతే ప్రయోజనంలేదు. దైవం నీవెంట జంట వుంటే జగత్తు అంతా నీకు హస్తగతం అయిపోతుంది. కనుక దైవాన్ని సంతృప్తి పరచడానికి తగిన ప్రయత్నం చేయండి దైవం సంతోషిస్తే, జగత్తు అంతా సంతోషిస్తుంది

లోకంలో ఎంతోమంది White Dress వేసుకుంటుంటారు. కాని Black Mind పెట్టుకుంటారు కాని మన ఇన్‌స్టిట్యూట్ పిల్లలు వేసుకోనేది White Dress మాత్రమేకాదు. వీరికి White Mind ఉంటుంది. పవిత్రమైన హృదయులు.

ఆపేరు నిలబెట్టుకుంటే చాలు. నాకు అదే చాలా సంతోషం. నేను ఎప్పుడూ మీ వెంటనే, జంటనే, ఇంటనే, కంటనే ఉంటున్నాను. మీరందరూ గొప్పగుణవంతులై, ప్రజ్ఞానాన్ని, విజ్ఞానాన్ని లోకానికి చాటుతూపోవాలి. ఈనాడు దేశంలో ఎక్కడ చూచినా అశాంతి, బాధలు, కష్టాలు కనబడుతున్నాయి. మీరు ఈదుర్గంధాన్ని దూరం చేయండి. ఆనందాన్ని అభివృద్ధి పరచండి. జగత్తుకు పంచండి. మీరు అనుభవించండి. ఇదే నా ఆశ.

వచ్చే Sports వరకు కాచుకొని కూర్చోనవసరం లేదు. నిత్యమూ మీరు చేయవలసిన కర్తవ్యాలు చేస్తూపొండి భగవంతుని నామస్మరణ చేసుకుంటూ, ఆ ప్రేమ చేతనే మీరు ధన్యులు కాండి.

(ది. 14-1-2000. ప్రశాంతి నిలయంలో Sports Day సందర్భమున భగవాన్‌సాయి చేసిన దివ్యప్రసంగము నుండి) ■

## సాయినాథ

"ప్రతిమాటలకు మారు పల్కుచునున్నట్టి
భార్యతో నేగెడి భర్త బ్రతుకు
ధర్మార్థ కామముల్ తనివార వర్తించి
మోక్షంబుగోరని మూర్ఖబ్రతుకు
సమయంబు వేచి సస్యము పెట్టకున్నట్టి
కర్షకు వర్తన కడిది బ్రతుకు
దుష్పుత్రకులు గల్గి దుఃఖమొందెడి యజ
మాన్యశీలుని హీనమైన బ్రతుకు
ఘోరవృక సింహ శార్దూల కుపితభల్ల
గండభేరుండములు గల్గు కాననమున
పాంథ జనులేగు గ్రీష్మపు పయనమువలె
సాధ్వసంబగు చుండదే సాయినాథ"

- విద్యానందం

# శ్రీ ముక్తానంద బాబా

ముంబాయికి దగ్గరలో ఉన్న గణేశ్‌పురిపేరు లోగడ ఎవరికీ అంతగా తెలియదు. ఎప్పుడూ నీటి ముంపుతోనూ, దొంగ పూబులతోనూ అనారోగ్యకర వాతావరణం తాండవించే ఆ కుగ్రామానికి ఒక సాధువు వచ్చి అక్కడ ఒక కుటీరం వేసుకొని నివసించసాగాడు. ఆశ్రమ స్థాపనకు అటువంటి అనారోగ్యకరమైన ప్రాంతాన్ని ఎందుకెన్నుకున్నాడా సాధువని అంతా ఆశ్చర్యపోయారు. అయితే కొద్ది కాలానికే ఆ ఫూరు దేశవిదేశాల నుండి వచ్చే భక్తులకు ప్రధానయాత్రా స్థలంగా మారింది. ఆ సాధుసత్తముని పేరు శ్రీ నిత్యానంద బాబా.

ఒకరోజు నిత్యానంద దర్శనంకై ఒక వ్యక్తి వచ్చాడు. బాబా దర్శనం కాగానే అతనికి తాను రావలసిన చోటుకే వచ్చాననిపించింది. ఎన్నో ఏళ్ళుగా అశాంతికి గురవుతున్న అతని మనసు ప్రశాంతతననుభవించింది. ఆయనే నిత్యానందకు వారసుడుగా ప్రసిద్ధినందిన ముక్తానంద బాబా. ముక్తానంద మంగుళూరు దగ్గర గల ఒక పల్లెలో 1908లో జన్మించారు. చిన్నతనం నుండీ ఆయనకు ఐహిక విషయాల పట్ల ఆసక్తి ఉండేది కాదు. 15వ ఏటనే ఆయన ఆధ్యాత్మిక జిజ్ఞాసతో ఇల్లు విడచి వెళ్ళారు. మొదట ఆయన శ్రీ సిద్ధారూఢస్వామి ఆశ్రమానికి వెళ్లారు. అక్కడ ఆయిన సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. ముక్తానంద అన్నది ఆయన సన్యాస నామమే.

తరువాత దాదాపు 20 ఏళ్ల పాటు ఆయన ఆసేతు హిమాచలం పర్యటించి, అనేక క్షేత్రాలను దర్శించారు. చివరకు గణేష్‌పురి చేరి నిత్యానందను శరణుజొచ్చారు. నిత్యానంద బాబాకు ఎందుకో ముక్తానందను చూడగానే ప్రత్యేకాభిమానం కలిగింది. 1947 ఆగస్టు 15నాడు అఖిల భారత స్వాతంత్ర్య అవతరణోత్సవాల సంరంభంలో మునిగివుండగా గణేశ్‌పురిలో మరొక మహత్తర సంఘటన జరిగింది. నిత్యానందబాబా ముక్తానందకు శక్తిపాతం చేసి అనుగ్రహించింది ఆనాడే. తరువాత దాదాపు తొమ్మిదేళ్ళ పాటు ముక్తానంద తీవ్రమైన సాధనలలో మునిగిపోయారు ఆ సందర్భంగా ఆయన యేక్‌లా, సూకీ, నాగడ్‌లలో తపస్సు చేశారు. 1956లో ఆయనకు ఆత్మసాక్షాత్కారం లభించింది. సరిగ్గా అదే సమయానికి ముక్తానందవున్న చోటికి ఎన్నో కిలోమీటర్లదూరంలోవున్న నిత్యానంద ఆనందంగా నృత్య చేస్తూ 'మన ముక్తానంద పరమహంస అయ్యాడు' అని అందరికీ చాటి చెప్పడం విశేషం.

1961లో ముక్తానందకు గురుపీఠాన్ని అప్పగించారు నిత్యానంద. ఆ తరువాత ముక్తానంద 3 సార్లు విదేశాలలో పర్యటించి సనాతన ఆధ్యాత్మిక సందేశాన్ని చాటిచెప్పారు.

### భండారు పర్వతాలరావు

ఒకనాడు తన తల్లిదండ్రులతోపాటు తనను దర్శించవచ్చిన ఒక చిన్నపిల్లను నిత్యానంద దగ్గరకు తీసి అనుగ్రహించారు. కాలక్రమేణా ఆ అమ్మాయియే చిద్విలాసానందగా ప్రసిద్ధి చెంది, ముక్తానంద బాబా వారసులుగా 1982లో గురు పీఠాన్నధిష్ఠించింది. గురుమాయిగా భక్తుల ప్రేమాభిమానాలను చూరగొన్నది. భక్తుల కోరికపై ముక్తానంద తన సాధనానుభవాలనన్నింటినీ వివరిస్తూ 'చిచ్ఛక్తి విలాసం' అన్న గ్రంథాన్ని రచించారు. దీనికి తెలుగు అనువాదం లభిస్తోంది. భగవాన్ ముక్తానంద బాబా రచించిన ఇతర గ్రంథాలు కుండలిని, ధ్యాన్ సోపాన్, సత్యకీ జోర్ మొదలయినవి. గణేశ్‌పురీ ఆశ్రమం సకల సౌకర్యాలతో అలరారుతూ నిత్యం వేలాది భక్తులను దేశవిదేశాల నుండి ఆకర్షిస్తోంది. ○

## విదురనీతి

"ధర్మార్థౌ యః పరిత్యజ్య
స్యాదింద్రియవశానుగః
శ్రీ ప్రాణధనదారేభ్యః
క్షిప్రం పరిహీయతే"

ఎవడు ధర్మార్థములను వదలి, ఇంద్రియములకు బానిస అగుచున్నాడో, అతడు త్వరలోనే ఐశ్వర్యమును, ధనమును, భార్యాదులను ప్రాణమున్ను పోగొట్టుకొనును.



# నేను నేనే



"నేనెవరు?" అని ప్రశ్నించారు భగవాన్ బాబావారు.
"స్వామీ! మీరు రాముడు" అన్నారు ఒకరు
"No" అన్నారు స్వామి
"స్వామీ! మీరు కృష్ణుడు" అన్నారు మరొకరు.
"No" అన్నారు బాబా
"బాబా మీరు క్రీస్తు, అల్లా" అన్నారు మరికొందరు
"No No. నేను నేనే" అన్నారు భగవాన్ బాబా

"నేను నేనే" అన్న శ్రీవారి సూక్తిని సూక్ష్మంగా గ్రహించ డానికి ప్రయత్నించవలసిన అవసరం ఉంది స్వామిని రాముడు, కృష్ణుడు, క్రీస్తు, అల్లా అంటూ ఇచ్చిన సమాధానాలు ఎందువలన సరియైనవి కావో ఆలోచించాలి. మనం ఆ రకంగా ఎందుకు పోల్చుకుంటున్నామో గ్రహించాలి. బాబా వారి సందేశాన్ని భగవద్గీత, ఉపనిషత్తు, వేదము అని కూడా అంటారు. స్వామిని వారి సందేశాన్ని ఈ రకంగా Compare చేస్తూ సామ్యాన్ని, సారూప్యాన్ని, ఏకత్వాన్ని నిరూపిస్తూ అనేకమంది చక్కని రచనలు, ప్రసంగాలు చేస్తున్నారు. దీనిలో ఏ దోషం లేదు చాలా మంచిపనే జరుగు తున్నది. చక్కని Research చేసినట్లయింది. మనోహరంగా చిత్రీకరించడం వల్ల హృదయానికి హత్తుకున్నట్లయింది. విశ్వాసం పెరిగినట్లనిపిస్తుంది. ఈ ప్రయత్నాలు ప్రయోజనాన్ని చేకూరుస్తున్నవి.

కాని ఈ అంశాన్ని మరొక దృక్కోణంలో విచారించ డానికి ప్రయత్నిద్దాం. రాముడు, కృష్ణుడు ఒకటే అని అంటారు. త్రేతాయుగంలోని రాముడే ద్వాపరయుగంలో కృష్ణుడు అని మన నమ్మిక. అయితే రాముడు కంసుని చంపినట్లుగా కృష్ణుడు వాలిని చంపినట్లుగా ఒప్పుకొన గలమా? సీతారాముని రాధారాముడని, రాధాకృష్ణుని సీతాకృష్ణుడని పిలిస్తే మనసు సమాధాన పడుతుందా? ఇద్దరూ ఒకటేగదా! మరి గాభరా పడుతున్నామెందుకు? "శివోహం" "శివోహం" (నేను శివుడను) అని పదే పదే ఉచ్చరిస్తూ "నీవు శివుడవైతే పార్వతి నీకేమవుతుంది?" అని ప్రశ్నిస్తే "అపచారం. అపచారం" అన్నట్లుంది మన వాలకం. "బుద్ధిమతాం వశిష్టం" రామాయణమాలా రత్నం" "నవ వ్యాకరణవేత్త"గా అభివర్ణింపబడిన ఆంజనేయస్వామి కృష్ణుని వెంటనే అంగీకరించక తిరిగి తన రామునిగా దర్శనమిస్తేగాని సంతృప్తి చెందలేదు కదా! ఎందువలన? మనకు తెలిసిన పాటి అభేదశక్తి అద్వైతము హనుమంతునికి లేదనడం హాస్యాస్పదం కాదా? కనుక రాముడు రాముడే! కృష్ణుడు కృష్ణుడే! కాని దివ్యత్వం ఒకటే! "రూపనామములు వేరు నారాయణుండొక్కడే" అన్నారు గదా మన స్వామి. దైవత్వము కాలగతి ననుసరించి రూపనామములతో విరాజిల్లుచు ఏకత్వంగా భాసిస్తున్నది. కృష్ణుడు అంతా తానేనని సర్వము తానేనని చాటినాడేగాని, పూర్వము రాముడనై ఈనాటి కృష్ణుడనైన నేనుగా ఎక్కడా చెప్పు

కామరాజు అనిల్‌కుమార్

కోలేదు. మనం మనసుని కాస్త పరిశీలించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. చాలామందిలో ముఖ్యంగా మన దేశంలో మన ఆలోచనా ధోరణి విలక్షణంగా ఉంటుంది. ఏది చెప్పండి - కొందరు వెంటనే "భగవద్గీతలో చెప్పింది అదే కదా!" అంటారు. ఏనాడు గీతా శ్రవణం సంపూర్ణంగా చెయ్యకపోయినా గీతాధ్యయనం చెయ్యక పోయినా సరే! అంటే మన మనసు ఇప్పుడు విన్న విషయానికి గతంలో ఉన్న గీత సాక్ష్యాధారాలకి వెంటనే పరుగెత్తిందన్న మాట. బాబాగారు దసరా ఉపన్యాసాలలో బ్రహ్మతత్త్వం గురించి, అద్వైత దర్శనం గురించి ప్రసంగించారు అని మీరన్నారను కోండి. వెంటనే మరొకరంటారు "మనవేదం చెప్పింది అదే కదండీ! మన ఉపనిషత్తులు ఘోషించేదీ అదే కదా!" వీరు వేదాలు ఉపనిషత్తులు, ఘంటాపథంగా చదివి ఉండరని చెప్పవచ్చు. శ్రుతపాండిత్యం ఆధారంగా పలికిన మాటలే అవి. అనగా ఈనాటి బాబా సందేశానికి వెంటనే మనం ప్రామాణికతను నిరూపించడానికి ప్రాచీనగ్రంధాల దిశగా మనసు గతంలోనికి పరుగెత్తినదన్నమాట. స్వామి మహిమలు వర్ణిస్తుంటే ఒకరంటారు "కృష్ణలీలలు అంతే గదా!" స్వామి ఆదర్శాన్ని వివరిస్తుంటే రాముడు అచ్చు అలాంటివాడే కదా!" అని మరొకరంటారు. అనగా బాబా దివ్యత్వం సందేశాలని మనం రామునితో కృష్ణునితో Compare

'చేస్తున్నాం. వారి అవతారతత్త్వాన్ని ఈ రకంగా పూర్వావతార పోలికలతో సమన్వయ పరుస్తూ ఆనంద పడుతున్నాం. ప్రస్తుత వైభవానికి ప్రాచీన ఇతిహాస ప్రమాణాలు చరిత్రలు ఆధారమైనవని అర్ధమవుతుంది. వర్తమానంలోని అవగాహనకు ఆనందానికి గతంపైన ఆధారపడుతున్నాం. ఇది సరియైన ఆలోచనా విధానమేనా అని నన్ను నేను ప్రశ్నించుకుంటున్నాను. **Live in the moment. Live in the present. Live in the existence.** ప్రస్తుతాన్ని సందేహిస్తే గతం కావాలి. ఇప్పటి అనుభవాన్ని గడచిన కాలంలోని, అనుభవానికిరాని సంఘటనలు ఏ ప్రకారం ధృఢపరుస్తాయి నిరూపిస్తాయి? దుర్వాసుడు శిష్యులతో భోజనానికి అరణ్యమునకు తరలి వెళ్ళినప్పుడు నిస్సహాయురాలైన ద్రౌపదికి అక్షయపాత్రను ప్రసాదించిన కృష్ణుని మహిమ మనకు తెలిసినదే... చదివినదే... విన్నదే కాని మనం చూడలేదు అనుభవించలేదు. ఇప్పుడు అక్షయంగా అన్న రాసి పెరగడం, బాబాసాన్నిధ్యంలో చూస్తున్నాం. ఈ బాబా లీలను విశ్వసించడానికి, మన ఎదురుగా ఇప్పుడే ఇక్కడే జరుగుతున్న దానికి భాగవత కృష్ణలీల ఆధారం ప్రమాణం సామ్యం అవసరమా? మన మనసు గతాన్నే తల్చుకుంటున్నది. ఇది దోషమని నేరమని నేను అనటం లేదు. వర్తమానానికి గతం ఎందుకు యోచిస్తావంటున్నాను.

ఇప్పటి Beauty, Freshness, Uniqueness, Speciality relevance లకు దూరంకావటం అవసరమా? మల్లెపువ్వు ఈ ఉదయం వికసించి పరిమళాన్ని అందిస్తున్నది. ఇది ఇప్పటి అనుభవం. దీన్ని ఆనందించడానికి గతం అక్కర్లేదు. సూర్యోదయం, సూర్యాస్తమయం కోయిల కుహూకుహూ రావాలు, పరిగేత్తే సెలయేటి ధ్వని ఎప్పటి కప్పుడే ఆనందాన్నందించి పరవశం చేస్తాయి. దీనికి చారిత్రాకాధారాలు, గ్రంథాలు ప్రామాణ్యం, ఇతరుల సూక్తులు అనవసరం కదా! భగవద్ప్రసాదితమైన కవిత్వంతో కవులు వర్ణించవచ్చు. పరమేశ్వరానుగ్రహంతో పండితులు వివరించవచ్చు. శాస్త్రజ్ఞులు విశ్లేషించి పరిశీలించవచ్చు కాని నీవు ప్రకృతిని పరికించి పొందిన నీ స్వానుభవం స్వతంత్రమైనదే కాని గ్రంధస్థమైనది కాదు.

ఒకరింట్లో తాతగారికి మనుమడు ఉన్నారనుకుందాము. ఇద్దరిలో బాగా పోలికలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. మనుమడు తాతగారిలాగా ఉన్నాడంటామా? లేకపోతే తాత మనుమడిలాగా ఉన్నడంటామా? ఏది సమంజసం? కనుక 'రామునివలె' సాయి, 'కృష్ణ స్వామి' అనడం కూడా అలాంటిదే. ఇక్కడ మరొక విషయం మనం యోచించాలి. 'నదీనాం సాగరోగతి' అన్నారు. అన్ని నదులు సముద్రాన్ని చేరతాయి. సూర్యరశ్మి ప్రభావం వలన సముద్రపునీరు ఆవిరిగా మారి అవి మేఘాలుగా రూపాంతరమొంది వర్షించి సెలయేటిగా నదిగా ప్రవహించి చివరకు తిరిగి సముద్రాన్ని చేరటం మనకు తెలిసినదే. అదే విధంగా సముద్రం వంటిది దివ్యత్వము. అది ఏకత్వంగా నిలుస్తోంది. కాని నదులకు కృష్ణ గోదావరి పెన్న వంటి పేర్లు రూపాలు ప్రాంతాలు ఏర్పడ్డాయి నది జలాలు తిరిగి సముద్రంలో చేరిన తరువాత రూపనామాలు కోల్పోయి సముద్రము యొక్క నామము రూపము రుచి పొందుతాయి. ఒకే దివ్యత్వము ఇన్ని రూపాలతో నామాలతో ప్రకాశిస్తూ చైతన్య వికాసంతో అనేకత్వముగా గోచరిస్తుంది. కనుక రాముని దివ్యత్వము కృష్ణుని మాధవత్వము క్రీస్తు భగవతత్త్వము భిన్నముగా భావించటం పొరపాటే కాని రూపాలు నామములు దేశకాలములు విడివిడిగానే ఉంటాయి మనం చేస్తున్న పొరపాటు ఎక్కడున్నదో మనం విచారించాలి. నామరూపాలతో ఏకత్వాన్ని నిరూపించాలనుకుంటున్నాం. ఇది సాధ్యం కాదు. దివ్యత్వం ఒకటే-అదే వివిధ అవతారాలుగా దేశకాల స్థితిగతుల ననుసరించి ఏర్పడింది. బంగారంగా ఒకటే, నగలుగా వేరు. పాలుగా ఒకటే, ఆవులు అనేకం. ఒకే Leather తో Purse, Chappals, Belt చెయ్యవచ్చు. వీటి స్థానం ప్రయోజనం పేర్లు వేరు. కాని Leather ఒకటే కాన రామునిలోని 'నేను' కృష్ణునిలోని 'నేను' నీలోని నాలోని 'నేను'- అంతా ఉన్న ఆ 'నేను'-"నేనే"-'నేను నేనే' అని అర్థం చేసుకోవలసి ఉన్నది. 'క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత' క్షేత్రజ్ఞుడైన 'నేను నేనే' అని తెలుస్తుంది. ఈ ప్రకారం ఆలోచించినపుడు బాబాలో రామతత్త్వం, స్వామిలో కృష్ణలీలలు, ఏసుత్యాగం, వంటివి కనబడతాయి. అంతేగాని స్వామిని రామునిగానే భావించటం totality కాదు. కృష్ణుడే అనుకోటం Wholistic View కాదు. Comprehensive దృష్టి కాదు. నేను రామ భక్తుడను కనుక రామునిగా, కృష్ణభక్తుడను గనుక కృష్ణునిగా భావించవచ్చు. ఇది సంపూర్ణమైన Reality అనిపించుకోదు. క్రైస్తవులు Cosmic Christ అనుకుంటున్నారుకదా! అందు వల్ల "నేను" ప్రత్యేకించి ఏదీ కాదు. "నేను నేనే" అనటంలో అంతర్యం సర్వులలోని సమత్వమైన సర్వకాలీన మైన, నిత్యమైన, సత్యమైన శుద్ధ బుద్ధముక్త స్వరూపమైన ఆ-'నేను' -నేనే-స్వామియే అని గ్రహించటం సరియైనజ్ఞానం.

# లఘుపతనకుడు - మంధరుడు - చిత్రాంగుడు

ఆ విధంగా లఘుపతనక హిరణ్యాకులు ఎడతెగని సఖ్యంతో కాలం గడుపుతూ వుండగా ఒకనాడు వాయసం మూషికాన్ని చూసి ఇలా చెప్పింది "చెలికాడా! ఇక్కడ నాకు ఆహారం సంపాదించుకోవడం చాల కష్టంగా వుంది. కాబట్టి ఈ వనం విడిచి ఎక్కడికైనా తగిన తావుకు వెళ్ళాలని యత్నిస్తున్నాను" అనగా విని హిరణ్యకుడిట్లా చెప్పాడు. "దంతాలు, వెంట్రుకలు, గోళ్ళు, మనుషులు తామున్న చోటు విడిస్తే చులకనైపోతారు. కాబట్టి తెలివి మంతుడీ విషయం తెలుసుకొని చోటు మారాలనే బుద్ధి మానుకోవాలి" అంటే విని కాకి ఇలా అన్నది. "మిత్రమా! నువ్వు చెప్పిన విషయం పాటింప దగింది కాదు ఏనుగులు, సింహాలు, సత్పురుషులు తమ చోటు వీడి స్వేచ్ఛగా సంచరిస్తారు కాకులు, జింకలు, కుత్సిత పురుషులు తమ తావు విడవలేక నశించిపోతారు". అనగా విని హిరణ్యకుడిలా అన్నాడు. "సఖుడా! ఇక్కడ మానుకొని ఎక్కడికి పోవాలని నీయత్నం?" అంటే కాకి ఇలా పలికింది 'ముందు తావు చూసుకొని పాదం మోపికదా. వెనుక పాదం ఎత్తాలి? అలా సరైనచోటు చూసుకోకుండ వున్నచోటు వదలుకోవచ్చునా? కాబట్టి మారాల్సినతావు ముందుగా నిర్ణయించుకొన్నాకనే ఈ ప్రయత్నం చేశాను. అదేమంటే, దండకారణ్యంలో కర్పూర గౌరమనే కొలనువుంది. అందు నా ప్రియ మిత్రుడు మంధరుడనే తాబేటి రాజున్నాడు. అతడు చాల ఉదారస్వభావంకలవాడు. చేపలు, మొదలగు ఆహారదానాలతో నన్ను పోషింపజాలినవాడు' అనగా విని మూషికం ఇలా అనింది. "గౌరవం, జీవనం, బంధువులు, విద్యాసంపాదనం లేని దేశాన్ని విడిచిపెట్టాలని పెద్దలు చెబుతారు. కాబట్టి నీతో నన్నుగూడ తోడ్కొనిపో వస్తాను" అంటే లఘుపతనకం విని సంతోషపడి, "సరే"యని బయలుదేర్చి హిరణ్యకునితో సల్లాపాలాడుతూ కొన్ని రోజులకా కొలను చేరాయి మంధరుడు దూరం నుండే చూసి, యెదురు పోయి ఆహ్వానించి, లఘుపతనక హిరణ్యాకులకు తగిన విధంగా ఆతిధ్యమిచ్చాడు. అంతట లఘుపతనకం మంధరునికి హిరణ్యకుని గూర్చి పరిచయం చేసింది. ఆవల ఆమూడున్నూ పరస్పరం బద్ధ స్నేహంతో కాలం గడుపుతూ వచ్చాయి.

ఇలా వుండగా, ఒకనాడొక జింక వేటగాడు తఱుమగా చెదిరి గొప్ప వేగంతో అక్కడికి పరుగెత్తుకొని వచ్చింది అది చూసి భయపడి తాబేలు నీట జొచ్చింది మూషికం బొరియలో దూరింది. కాకి చెట్టు పైకెగిరింది ఆమీదట మాను మీదనుంచి కాకి నిక్కి నాలుగు వైపులా చూసి, భయసూచన ఏమీలేదని నిశ్చయించుకొని, మంధర హిరణ్యకులను పిలిచి, "మీరు భయపడకండి చుట్టు ప్రక్కల చాలదూరం చూచాను. భయ పడ్డానికి కారణం ఏదీ నాకంటబడలేదు" అనగానే తాబేలు జలం నుంచి, మూషికం బిలం నుంచి వెలికి వచ్చాయి. లఘుపతనక మున్ను వాటి దాపునవాలింది.

అంతట మంధరుడు భయంతో వడవడ వణుకుతుండే జింకను చూసి "నువ్వెవరు? ఎందుకిట్లా పరుగెత్తి వచ్చావు?" అని అడిగాడు. అందుకా జింక పక్కలెగర రోజుతూ ఇలా చెప్పింది "నాపేరు చిత్రాంగుడు. నన్ను వేటకాడొకడు తరుము కొచ్చాడు. వాడికి భయపడి పరుగెత్తుకొచ్చాను. వాడు

ఎమ్. మురళీ కృష్ణారెడ్డి

నాపఱుగు పట్టలేక వెనుకజిక్కినాడు మీకు నేను శరణాగతుణ్ణి. సర్వదానాలు, సర్వవ్రతాలు, సర్వయాగాలు శరణాగత రక్షణంతో సాటిగావు. అభయమని వచ్చినవాణ్ణి అశ్రద్ధ చేయటం కంటె పాపం లేదని ధర్మజ్ఞులు చెబుతారు. మీరు సర్వధర్మాలు తెలిసినవాళ్ళని బుద్ధిమంతులు చెప్పగా విన్నాను, మనసు కలతపడి వుండటం చేత ఇది చెప్పదగ్గ మాట, ఇది చెప్పగూడని మాటయని తెలియక ఏమేమో మాటలాడాను. మీకు ధర్మాలు చెప్పేపాటి వాణ్ణి కాను. నామాటల్లో తప్పుంటే క్షమించి నన్ను రక్షించండి. మీతో సఖ్యం సంపాదించుకొని, ఇక్కడ నివసిస్తూ కాలంగడపాలని నా కోరిక. మా బంధువుల్ని, మా దేశాన్ని విడిచి వచ్చేసాను మీ మరుగుజొచ్చాను. నన్నింక పాలముంచుతారో, నీటముంచుతారో మీదే భారం" అని వేడుకోగావిని, మంధరుడిలా అన్నాడు. "చిత్రాంగా! నువ్వు తెలివి మంతుడివి. మంచివాడివి నీతో సావాసం మాకు తప్పక చేయదగిందే దీనికింత దూరం చెప్పాల్సిన పనేలేదు. ఈ తావు నీ యిల్లుగా తలుచుకొని మాతో గూడి యథేచ్ఛగా విహరిస్తూ సుఖంగా వుండు" అని చెప్పగా జింక చాల సంతోషించి, వాటితో గూడి హాయిగా కాలక్షేపం చేస్తూవుండింది. ఈ విధంగా కాక కూర్మ మృగ మూషికాలు ఒకదానితోనొకటి మైత్రి సంపాదించుకొని, ప్రాణస్నేహితులుగా జీవిస్తూ వచ్చాయి.

**నీతి :** బ్రతుకుతెరువున్న తావుకు మారుకొని బ్రతకడమే బుద్ధిమంతుని లక్షణం

శరణుజొచ్చినవాడు, శత్రువైనాసరే కాపాడటం గొప్ప ధర్మం.

# బెజవాడ కాంగ్రెస్ సభల సూత్రధారి 'అయ్యదేవర'

1921 మార్చి 31, ఏప్రియల్ 1వ తేదీలలో బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మహాసభలు జరిగాయి. 1885లో అఖిల భారత కాంగ్రెస్ పార్టీ స్థాపించబడినా ఆంధ్ర ప్రాంతంలో ఆ పార్టీకి చెందిన జాతీయ మహాసభలు అంతవరకు జరగలేదు. ఆంధ్ర ప్రాంతానికి నడిబొడ్డు అయిన బెజవాడలో ఇవి జరగడానికి కారకులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు

మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికా నుంచి భారత దేశానికి శాశ్వతంగా వచ్చిన తర్వాత మొట్టమొదట సారిగా 1915లో ఆంధ్ర దేశాన్ని సందర్శించారు. 1915 మే 4వ తేదీన నెల్లూరు పట్టణంలో 21వ ప్రొవెన్షియల్ మహాసభలు జరిగాయి. అందులో పాల్గొనడానికి మహాత్మాగాంధీ వచ్చారు. ఈ మహాసభలకు ఆనాటి ఆంధ్ర నాయకులు అందరూ హాజరయ్యారు వారందరికీ మహాత్మా గాంధీతో పరిచయం ఏర్పడింది. ఆ సమావేశానికి హాజరయి మహాత్మా గాంధీతో పరిచయం ఏర్పరచుకుని దానిని పెంపొందించుకున్న వారిలో కాళేశ్వరరావుగారు ఒకరు

1919 మార్చి 31వ తేదీన గాంధీజీ సికిందరాబాద్ నుంచి బెజవాడకు వచ్చి కాళేశ్వరరావుగారి ఇంట్లో బస చేశారు. 1920లో మౌలానా షౌకత్ ఆలీతో కలిసి, బెజవాడకు వచ్చి కాళేశ్వరరావుగారి యింట్లో బసచేశారు. ఆ విధంగా గాంధీజీ, కాళేశ్వరరావుల మధ్య సాన్నిహిత్యం పెరిగింది.

1920లో నాగపూర్‌లో విజయరాఘవాచారిగారి అధ్యక్షతన కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. అందులో కాళేశ్వరరావుగారు కూడా పాల్గొన్నారు. తరువాతి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశాలను బెజవాడలో జరిపించవలసిందిగా ఆ సమావేశంలో పాల్గొన్న కాళేశ్వరరావుగారు మహాత్మాగాంధీ, చిత్తరంజన్‌దాస్ విజయరాఘవాచారివంటి అగ్రనాయకులకు విజ్ఞప్తిచేశారు. దానికి వారు అనుకూలంగా స్పందించడంవలన బెజవాడలో కాంగ్రెస్ మహాసభలు జరగడానికి రంగం ఏర్పడింది. ఈ సభల నిర్వహణకు కాళేశ్వరరావుగారి నాయకత్వంలో ఆహ్వాన సంఘం ఏర్పడింది

ఆ సభలలో పాల్గొనడానికి మహాత్మాగాంధీతో సహా కాంగ్రెస్ అగ్రనాయకులంతా బెజవాడకు తరలి వచ్చారు ఆ రోజులలో బెజవాడలో బసచేయడానికి హోటళ్లు కాని రెస్ట్ హౌస్‌లు కాని ఉండేవి కావు. అందువలన బెజవాడ సమావేశంలో పాల్గొనడానికి వచ్చిన జాతీయ నాయకులకు ఒక్కొక్క స్థానిక ప్రముఖుల ఇంటిలో వసతి ఏర్పాటు చేశారు. ఆవిధంగా బెజవాడ ప్రముఖులకు ఆనాటి జాతీయనాయకులకు ఆతిథ్యం ఇచ్చే గౌరవమూ,అదృష్టము కలిగాయి. చిత్తరంజన్‌దాస్ ఆయన అనుచరులకు కాళేశ్వరరావుగారు తమ యింట బస ఏర్పాటుచేశారు.

## కంచి వాసుదేవరావు

మోతీలాల్‌నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూలకు ప్రఖ్యాత న్యాయవాది దాసు మధుసూదనరావుగారింట్లో బస ఏర్పాటయింది. సింగరాజు వెంకట సుబ్బారావుగారి యింట్లో పంజాబు కేసరి లాలాలజపతిరాయి విడిది చేశారు. బాబూ రాజేంద్రప్రసాద్ పెద్దిభొట్ల వీరయ్యగారింట్లో బసచేశారు. పార్టీ అధ్యక్షులు విజయరాఘవా చారిగారికి పాటిబండ్ల వెంకట రమణయ్య గారింట్లో వసతి కల్పించారు. యన్.సి. కేల్కర్ గారికి చింతగింజల సూర్యనారాయణ గారింట్లో బస ఏర్పాటు చేశారు. ముస్లిం నాయకులకు స్థానిక ముస్లిం ప్రముఖులు ఆతిథ్యమిచ్చారు. ఈ మహాసభల నిర్వహణకు గొల్ల నారాయణ అనే వదాన్యుడు భూరి విరాళమిచ్చారు. అందువలన ఆయన అభ్యర్థనకు అనుకూలంగా స్పందిస్తూ మహాత్మాగాంధీ - పటేల్ సోదరులు (విఠల్‌భాయిపటేలు వల్లభాయిపటేల్) నారాయణ గారింట్లో బస చేశారు ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఆయన నాయకత్వంలోని రామ దండు వాలంటీర్ల బృందం తోడ్పాటుతో చరిత్రాత్మకమైన ఈ మహాసభలను కాళేశ్వరరావు గారు జయప్రదంగా నిర్వహించారు. ఈ స్ఫూర్తితోనే 1923 చివరలో కాకినాడ పట్టణంలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు షౌకత్ ఆలీ అధ్యక్షతన జరిగాయి బెజవాడ మహాసభలు

విజయవంతముగా ముగియడంతో ఆంధ్ర నాయకులు జాతీయ కాంగ్రెస్ నాయకుల అభిమానాన్ని ప్రశంసలను చూరగొన్నారు. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి చిత్తరంజన్‌దాస్ రాజీనామా చేసినప్పుడు పార్టీ తాత్కాలిక అధ్యక్షునిగా దీన బంధు కొండా వెంకటప్పయ్యగారు నియమితులయ్యారు.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రధాన కార్యదర్శి. కొన్ని నెలలపాటు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యాలయం బెజవాడకు మారింది. ఈ చారిత్రక పరిణామాలన్నింటికీ కాళేశ్వరరావుగారికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం ఉంది.

కాళేశ్వరరావుగారు 1881వ సంవత్సరం జనవరి 22వ తేదీన కృష్ణాజిల్లా నందిగామలో జన్మించారు. ప్రాథమిక విద్య ఆ గ్రామంలోనే జరిగింది ఆ తర్వాత ఆనాటి ప్రధాన విద్యాకేంద్రం బందరు నోబుల్ కాలేజీలో చదివి మద్రాస్‌లో లా విద్యను పూర్తిచేశారు. బెజవాడలో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించి అనతికాలంలోనే పేరుపడ్డ లాయరుగా స్థిరపడి డబ్బు సంపాదించారు. ఈలోగా మహాత్మాగాంధి పిలుపునకు స్పందించి కాసులు పండిస్తున్న వృత్తిని వదులుకుని పూర్తిగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు.

అన్ని స్వాతంత్ర్య సమర ఘట్టాలలో పాల్గొని జైలుకు వెళ్ళారు. 1925లో బెజవాడకు జరిగిన మున్సిపల్ ఎన్నికలలో కాళేశ్వరరావుగారి నాయకత్వంలో కాంగ్రెస్ పాల్గొని జస్టిస్ పార్టీని చిత్తుగా ఓడించారు. కాళేశ్వరరావు గారు మున్సిపల్ ఛైర్మన్ అయ్యారు. తన పదవీకాలంలో బెజవాడ సర్వతోముఖాభివృద్ధికి అవిరళ కృషి జరిపారు. ఆయన చేసిన కృషికి గుర్తింపుగా బెజవాడ నడిబొడ్డులో సువిశాలమైన ప్రాంతంలో ఏర్పడిన మార్కెటుకు ఆయన పేరుపెట్టారు. గవర్నర్‌పేట ఒక ప్రధాన వీధికి ఆయన పేరుపెట్టారు. 1937లో ఆయన మద్రాస్ శాసనసభకు ఎన్నికయ్యారు. పార్లమెంటరీ సెక్రటరీగా నియమితులు అయ్యారు. 1946లో జరిగిన ఎన్నికలలో విజయవాడ, మచిలీపట్టణాల సమిష్టి నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా కమ్యూనిస్ట్ అభ్యర్థి తమ్మిన పోతరాజుపై ఘనవిజయం సాధించారు. ప్రకాశం మంత్రివర్గంలోకాని, తర్వాతి మంత్రివర్గాలలోకాని రాష్ట్ర కాంగ్రెస్ సీనియర్ నాయకులలో ఒకరైన కాళేశ్వరరావుగారికి మంత్రిపదవి లభించకపోవడం ఆయనకేకాక చాలామందికి అసంతృప్తి కలిగించింది. 1952 ఎన్నికలనాటికి కొంత అనారోగ్యం, కొంత అసంతృప్తి కారణంగా శాసన సభకు జరిగిన ఎన్నికలలో పోటీచేయలేదు ఆ ఎన్నికలలో పేరువున్న ప్రతి కాంగ్రెస్ నాయకుడూ ఓడిపోయారు. కాళేశ్వరరావుగారు పోటీ చేయకపోవడంతో పరాజయ పరాభవం నుండి తప్పించుకో గలిగారు. 1955లో ఆంధ్ర రాష్ట్ర విధాన సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాళేశ్వరరావుగారు విజయవాడ తూర్పు నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరించింది. ఆంధ్ర రాష్ట్ర విధాన సభ్యులు నిజాం రాష్ట్ర తెలంగాణా ప్రాంత సభ్యులతో ఆంధ్రప్రదేశ్ విధాన సభ ఏర్పాటయింది. సంజీవరెడ్డి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. విధానసభకు ఎవరిని ఎన్నుకోవాలి. రెండు ప్రాంతాలవారి విశ్వాసం చూరగొన్న సీనియర్ నాయకునికోసం అన్వేషణ ప్రారంభమయింది. అది ఫలించి ఈ కీలక పదవికి అన్నివిధాల అర్హులయిన కాళేశ్వరరావుగారు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

ఆంధ్రప్రదేశ్ తొలివిధాన సభను కాళేశ్వరరావు గారు ఎన్నో ఉన్నత ప్రమాణాలతో హుందాగా ఆదర్శ ప్రాయంగా నిర్వహించారు.

సుస్థిరమైన పార్లమెంటరీ సాంప్రదాయాలను నెలకొల్పారు. శాసనసభ గౌరవానికికాని, స్పీకర్ పదవికిగాని కాస్తంత అగౌరం కలిగించినా కాళేశ్వరరావుగారు స్పీకర్‌గా సహించేవారుకారు. ఆ విషయం నాకు స్వయంగా తెలుసు. 1957 ప్రాంతంలో నేను బందరు నుంచి వెలువడే కృష్ణాపత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేసేవాడిని. అప్పుడు మా హైదరాబాద్ విలేకరి రాష్ట్ర విధానసభ కార్యకలాపాలను సమీక్షిస్తూ స్పీకర్ సభ్యుల పట్ల హెడ్మాష్టర్ తన బడి పిల్లలతో వ్యవహరిస్తున్నట్లుగా వ్యవహరిస్తున్నట్లున్నదని రాశారు. ఈ వ్యాఖ్య సభా గౌరవానికి భంగకరమని కాళేశ్వరరావు గారు భావించి కృష్ణాపత్రికపై చర్య తీసుకోవాలనుకున్నారు. ఐతే కృష్ణాపత్రికస్థాయి స్వయంగా తెలిసినందువలన పబ్లిషర్ ఆర్.డి.యల్. నరసింహమూర్తి గారు ఇచ్చిన వివరణతో సంతృప్తి చెంది ఎట్టి చర్య తీసుకోక వూరుకున్నారు. 1962లో విధానసభకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ తరపున విజయవాడ నియోజకవర్గం నుంచి పోటీ చేశారు. ఆయన విజయఫలితం వెలువడడానికి కొద్దిగంటల ముందుగానే కాళేశ్వరరావు దివంగతులయ్యారు. తరువాత జరిగిన ఉపఎన్నికలలో ఈనియోజక వర్గం నుంచి టి.వి.యస్. చలపతిరావుగారు ఎన్నికయినారు.

శాసనసభ్యునిగా వరకట్న నిషేధం, దేవదాసి నిరోధ చట్టాలకు రూపకల్పన జరిపి అవి ఆమోదింపబడేట్టు చేశారు. కాళేశ్వరరావుగారు రాజకీయరంగంలోకన్న సాహిత్య సామాజిక రంగాలలో ఎక్కువ కృషి చేశారు. ఆంధ్ర రాష్ట్ర గ్రంధాలయోద్యమంలో ఆయన అయ్యంకి వెంకట రమణయ్య, గాడిచర్ల హరి సర్వోత్తమగార్లకు అండగా నిలబడ్డారు. బెజవాడలోని ప్రసిద్ధ రామమోహన గ్రంధాలయ వ్యవస్థాపకులలో ఒకరు. ఆ పట్టణంలో గ్రంధాలయాల స్థాపనను కాళేశ్వరరావుగారు ప్రోత్సహించే వారు.

కాళేశ్వరరావుగారు తన జీవిత చరిత్రను నవ్యాంధ్ర పేరిట గ్రంధస్తం చేసి ఆనాటి రాజకీయ సామాజిక స్వరూపాన్ని కళ్లకు కట్టినట్లుగా చిత్రించారు. కామరాజు లక్ష్మణరావుగారు విజ్ఞానచంద్రికా గ్రంధమండలి కార్యకలాపాలలో ఆసక్తిగా పాల్గొన్నారు. తురుష్కదేశాల చరిత్రనుండి గ్రంధాలను రచించారు. స్పీకర్‌గా ఉండగా హైదరాబాద్‌లో అకాడమీల ద్వారా ఉర్దూ, తెలుగు సాహిత్యాలకు గణనీయమైన సేవ చేశారు. కాళేశ్వరరావు గారు ఇంగ్లీషులో పండితుడు.

బెజవాడలో తన సోదరి అచ్చమాంబతో కలిసి అనేక స్త్రీహిత కార్యక్రమాలను చేపట్టారు. బృందావన స్త్రీ సమాజాన్ని స్థాపించి వరకట్నం వంటి స్త్రీల సమస్యలపై పోరాడారు. నూలు వడకడం, హిందీబోధన వంటి గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొన్నారు. కాళేశ్వరరావు గారు 1575 చదరపు గజాల స్థలాన్ని సేకరించి అందులో ప్రముఖుల బస నిమిత్తం భవనాలను నిర్మించారు. ఆయన మౌళిక ప్రవృత్తి ప్రజాసేవ - అందుకు ప్రతి అవకాశాన్ని వినియోగించుకున్నారు. రాజకీయాలలో తలమునకలయి ఉండి కూడా రాజకీయ అవినీతి కల్మషం అంటని వారిలో ఆయన ఒకరు.

సాయిమహిమలందు సంతసమగుటయే
మంచి లక్ష్యమని తలంచినాను
స్వామిదృష్టి యెపుడు సద్భక్తుని కొరకు
వెదకుచున్నవని నామదికి తోచె
అమ్మవాడికొరకు ఆక్రందనలు సల్పు
పసిబిడ్డ యార్తియే పావనమని
నిత్యనిరంతర సత్యసాయీ పరం
జ్యోతి సన్నిధి చేరు నీతి నరసి
పయనమగుదు పర్తీశుని భవనమునకు
ఆర్షమైన సాయీబోధనాలకిరాని
నరుల విలువల విభవాల సిరులు పొంది
కొలుచుచుందు సాయీశుని కొలువుచేరి
అభయహస్తముతెల్పె అచలభక్తినిగూర్చి సాయిమూర్తిని
గన్నసమయమందు
భయమువీడుమనుచు ఆ అభయమెచెప్పె! శుభద
మౌపర్తీ శుచూచినపుడు
శుభములెన్నో చూపు నభయహస్తముగల్గు
దివ్యమంగళసాయి తేజమందు
భయమువీడిన దివ్యభావనా సాధాన సత్యసాయిని
చూచు సరణి తెలిసి
భక్తిసాధకులంతచిచ్ఛక్తి యందు
తన్మయానందమొందుడే ధన్యపధము
శరణ పొందుటకిది మంచి తరుణమనుచు
అర్చనలు సల్పరంజోయి! ఆర్యులార

- పంచాంగం శ్రీనప్పశాస్త్రి పుట్టపర్తి



# విద్యారంగంలో



# ప్రైవేటు విద్యాసంస్థల పాత్ర - ఆవశ్యకత

విద్యారంగం మన రాష్ట్రంలో ప్రైవేటుపరమై పోతున్నదని ఈనాడు కొంతమంది గగ్గోలు పెడుతున్నారు. విద్య వ్యాపారంగా (Commercial) రానురాను మారు తున్నదని, సామాన్యునికి అందుబాటులో లేకుండా ఖరీదై పోతున్నదని విమర్శిస్తున్నారు మరికొందరు. ఇన్ని విమర్శలు వస్తున్నప్పటికీ నేటి సమాజంలో ప్రైవేటు విద్యాసంస్థల ప్రాముఖ్యత పెరుగుతూనే ఉన్నది. ప్రభుత్వ విద్యాసంస్థల స్థితి నానాటికి దిగజారిపోతూనే ఉన్నది. దీనికి కారణమేమిటి?

ఆంధ్రప్రదేశ్‌లో ఈనాడు దాదాపు సగం మంది పిల్లలు కె.జి నుండి పి.జి. వరకు ప్రైవేటు విద్యా సంస్థలలో, కాన్వెంట్స్‌లో చదువుతున్నారు. సంపన్నుల పిల్లలే గాక సామాన్య మధ్యతరగతి పిల్లలు ఎక్కువ మంది రాజకీయ నాయకులు, శాసనసభ్యులు, లోక్‌సభ సభ్యులు, మంత్రులు మరియు ఉన్నతోద్యోగులు తమ పిల్లలను కూడా కాన్వెంటులకు, ప్రైవేటు విద్యా సంస్థలకే పంపుతున్నారు. ఎందువలన? ఒక వైపున ప్రభుత్వ విద్యాసంస్థలలో ఉచితంగా చదువు చెబుతున్నప్పటికీ, ఉచితంగా అచ్చు పుస్తకములు యిస్తున్నప్పటికీ, అనేక ప్రోత్సాహ పథకములను ప్రభుత్వ విద్యాసంస్థలలో ప్రవేశ పెడుతున్నప్పటికీ అక్కడ సంఖ్య నానాటికి దిగజారిపోతున్నది. ఫీజులు చెల్లించి కూడా ప్రైవేటు విద్యాసంస్థలలో పిల్లలను చేరుస్తున్నారు తల్లిదండ్రులు. దీనికి కారణం ఏమిటి? ఇది చాలా తీవ్రంగా ఆలోచించవలసిన విషయం. సునిశితంగా పరిశీలించ వలసిన విషయం.

మన రాష్ట్రంలో ఆరు రకముల విద్యా సంస్థలు ఉన్నాయి. 1. ప్రభుత్వ వసతి విద్యాలయములు (Govt Residential Schools), 2 ప్రభుత్వ విద్యాలయములు (Govt Schools), 3. స్థానిక సంస్థలచేత నడుపబడే విద్యా సంస్థలు (జిల్లా పరిషత్, మండల, మున్సిపల్ స్కూల్స్), 4. ప్రభుత్వము చేత గుర్తింపు పొందిన ఎయిడెడ్ స్కూల్స్, 5. ప్రభుత్వము చేత గుర్తింపు పొందిన అన్ ఎయిడెడ్ స్కూల్స్, 6. ప్రభుత్వము నుండి ఎట్టి గుర్తింపు పొందకుండా నడుపబడుతున్న ప్రైవేటు కాన్వెంటులు మరియు ట్యుటోరియల్ విద్యాసంస్థలు. వీటిలో ఎయిడెడ్, అన్ ఎయిడెడ్ స్కూల్స్ ప్రైవేటు మేనేజిమెంటుల ఆధ్వర్యమున (4,5 సీరియల్ నెంబర్లు) నడుపబడుతున్నాయి.

పై కేటగిరి స్కూల్స్‌లో ప్రభుత్వ వసతి విద్యాలయముల (వ.నెం. 1) బాలబాలికలు అత్యధిక శాతం మార్కులతో ఉత్తీర్ణులవుతున్నారు. రెండవ స్థానం ప్రభుత్వ గుర్తింపు పొందని ప్రైవేటు విద్యా సంస్థలది (వ.నెం.6). ఆ తరువాత స్థానం ఎయిడెడ్, అన్‌ఎయిడెడ్ (వ. నెం 4 మరియు 5) వారిది, ప్రభుత్వం చేత, స్థానిక సంస్థల చేత (వ. నెం. 2 మరియు 3) నడుపబడే విద్యా సంస్థలలో మాత్రం ఆశించిన ఫలితాలు రావటం లేదు. 10వ తరగతి పరీక్షలలో 'సున్నా' శాతం ఫలితాలు వస్తున్న విద్యాసంస్థలు కూడా కొన్ని కనిపిస్తున్నాయి. ఈ వాస్తవమును ప్రభుత్వం కూడా అంగీకరిస్తున్నది.

కొమరగిరి కృష్ణమోహనరావు

ప్రభుత్వం, స్థానిక సంస్థల విద్యాలయాలలో అన్ని వసతులు ఉన్నాయి. ట్రయిన్డ్ టీచర్స్ ఉన్నారు. అయినప్పటికీ ఆశించిన విధంగా ఫలితాలు రావటం లేదు. అయితే కొన్ని ప్రభుత్వ, స్థానిక సంస్థల విద్యాలయముల పనితీరు మాత్రం బాగానే ఉన్నది. అయితే ఎక్కువ శాతం ప్రభుత్వ విద్యాసంస్థల పరిస్థితి మాత్రం ఆశించిన విధంగా లేదు ఇకపోతే కాన్వెంట్స్‌లో మరియు ప్రభుత్వ గుర్తింపు లేని ప్రైవేటు విద్యాసంస్థలలో ఎక్కువమంది ట్రయిన్డ్ టీచర్లు లేకపోయినప్పటికీ అధిక శాతం ఉత్తీర్ణతను బాలబాలికలు సాధిస్తున్నారు. దీనికి కారణమేమిటి?

ప్రైవేటు విద్యాసంస్థల యాజమాన్యం వారు, అందులో పనిచేసే ఉపాధ్యాయులు, పిల్లల మీద అత్యధిక శ్రద్ధ తీసుకోవటం వలన అక్కడ ఉత్తీర్ణతా శాతం ఎక్కువగా ఉంటున్నది. ప్రభుత్వ, స్థానిక సంస్థలలోని విద్యాలయాలలో అధ్యాపకులు తీసుకోవలసినంత స్థాయిలో శ్రద్ధ తీసుకోక పోవటం వలన అక్కడ ఉత్తీర్ణతా శాతం తరిగిపోతున్నది. ఈ వాస్తవమును గౌ॥ ముఖ్యమంత్రులు, గౌ॥ విద్యా

మంత్రులు సహితం అంగీకరిస్తూ పలు పర్యాయములు ప్రకటనలు కూడా చేసారు.

తల్లిదండ్రులు కోరుకునేది వారి పిల్లల భవిష్యత్తు, చదువు. తన పిల్లవాడు ఉచ్ఛ స్థితికి పోవాలని కోరుకుంటాడు ప్రతి తండ్రి. అందువలన ఎక్కడ బాగా చదువు చెబుతుంటే ఆ స్కూల్‌లో తన పిల్లవాడిని చేర్పిస్తాడు ఆ తండ్రి. ప్రభుత్వ, స్థానిక సంస్థల విద్యాలయాలలో ఆశించినంత చదువు లేదని తల్లిదండ్రులు గ్రహించడం వలన, ఫీజులు చెల్లించి కూడా తమ పిల్లలను మంచి విద్యాసంస్థలకు పంపు తున్నారు తల్లి దండ్రులు. తల్లిదండ్రులు ఆశించినంత, మంచిగా ప్రభుత్వ, స్థానిక సంస్థల విద్యాసంస్థలలో చదువు చెబుతుంటే, ఫీజులు కట్టే ప్రైవేటు విద్యాసంస్థలకు తమ పిల్లలను ఏ తల్లీతండ్రీ పంపడు. ఈ వాస్తవమును గ్రహించకుండా విద్య ప్రైవేటు పరమైపోతున్నదని గగ్గోలు పెడితే ప్రయోజనం లేదు. ఈనాడు మన రాష్ట్రంలో ప్రైవేటు విద్యాసంస్థలే గనుక లేకపోతే, మెరిట్ ఏనాడో దెబ్బ తినేది. ఈ సత్యమును గ్రహించకుండా ప్రైవేటు విద్యా సంస్థల మీద విమర్శనాస్త్రములను కురిపించడం ఏ మాత్రం వివేకం అనిపించుకోదు.

ఏ రంగంలో అయినా సరే పోటీ ఉండటం మంచిది. ప్రభుత్వ ప్రైవేటు రంగాల మధ్య ఆరోగ్యకరమైన పోటీ ఉన్నప్పుడే ప్రజలకు మంచి చేకూరుతుంది. అదే విధంగా విద్యారంగంలో కూడా ప్రైవేటు, ప్రభుత్వ విద్యా సంస్థల మధ్య ఆరోగ్యకరమైన పోటీ (Healthy Competition) ఉన్నప్పుడే విద్యార్థులకు మంచి విద్య లభిస్తుంది. ఉత్తమ ఫలితాలు చేకూరుతాయి. ఉత్తీర్ణతా శాతం పెరుగు తుంది. అఖిల భారతస్థాయిలో నిర్వహింపబడే పోటీ పరీక్షలలో కూడా అత్యధిక శాతం మన రాష్ట్రమునకే లభిస్తుంది. మన రాష్ట్ర ప్రతిభ ఇనుమడిస్తుంది. అంతేగాక విద్యాసంస్థల పరిస్థితి ఇంకా మెరుగవుతుంది. ముఖ్యంగా ప్రభుత్వ, స్థానికసంస్థల విద్యాలయాలు కూడా బాగు పడుతాయి. ప్రభుత్వ స్థానిక విద్యాసంస్థలకు చెందిన విద్యాసంస్థలు బాగుపడితే, ప్రైవేటు విద్యాసంస్థలు వాటంతట అవే కనుమరుగై పోతాయి. అప్పుడు ప్రైవేటు విద్యాసంస్థల మీద ఎవ్విధమైన ఆంక్షలను విధించనవసరం లేదు. ఈ సత్యమును గ్రహించకుండా, ఈ వాస్తవమును గుర్తించ కుండా ప్రైవేటు విద్యాసంస్థల మీద విమర్శనలు చేయటం అవివేకం.

ఇకపోతే మరో ఆరోపణ కూడా ఈనాడు వినిపిస్తున్నది. విద్య వ్యాపారంగా మారిపోతున్నదని, ప్రైవేటు విద్యాసంస్థలు దోచుకుంటున్నాయని కొందరు విమర్శిస్తున్నారు. కార్పోరేషన్ స్థాయిలో అధికంగా, మున్సిపల్ స్థాయిలో మధ్యరకంగా, పంచాయితీ స్థాయిలో సామాన్యంగా ఫీజులు ప్రైవేటు విద్యా సంస్థలు వసూలు చేస్తున్నాయి. అత్యధికంగా వసూలు చేసే ప్రైవేటు విద్యాసంస్థలను వేళ్ళమీద లెక్కించవచ్చును. ప్రజలలో వాటి మీద ఉన్న వ్యామోహం వలన అటువంటి పెద్ద పెద్ద విద్యాసంస్థలు కొన్ని మాత్రమే అధికంగా ఫీజులు వసూలు చేస్తున్నాయి. అటువంటి ప్రైవేటు విద్యాసంస్థలు 5% కూడా ఉండవు. అందులో ఎక్కువ భాగం ప్రభుత్వ గుర్తింపు పొందిన ప్రైవేటు విద్యా సంస్థలే ఉన్నాయి. అందులో ఎక్కువ భాగం క్రైస్తవ మిషనరీలు, మరియు బడా బడాల చేత నిర్వహించబడే పెద్ద పెద్ద విద్యా సంస్థలు మాత్రమే ఉన్నాయి. ఇవి డొనేషన్లు కూడా వసూలు చేస్తున్న మాట వాస్తవమే. ఇటువంటివి ముఖ్యముగా పెద్ద పెద్ద కార్పోరేషన్ పట్టణాలలోనే ఉన్నాయి. ఇటువంటి పెద్ద పెద్ద పబ్లిక్ స్కూల్స్‌ను దృష్టిలో పెట్టుకొని మొత్తం ప్రైవేటు విద్యా సంస్థలను విమర్శించటం విజ్ఞత కాదు.

ఈ సందర్భంలో ఒక వాస్తవమును ప్రజల దృష్టికి తీసుకొని వస్తున్నాను. మన రాష్ట్రంలో ప్రభుత్వం ప్రతి సంవత్సరం విద్యారంగమునకు సుమారు రు. 2000 కోట్ల పైన ఖర్చు పెడుతున్నది. ఇట్టి ఖర్చు కేవలం ప్రభుత్వ స్థానికసంస్థలు, ఎయిడెడ్ మరియు అన్ ఎయిడెడ్ పాఠశాలల మీదనే ఖర్చు చేస్తున్నది. గుర్తింపు లేని ప్రైవేటు విద్యాసంస్థల మీద ఏమాత్రం ఖర్చు పెట్టటం లేదు. వాళ్ళ కాళ్ళమీద వారే నిలబడి విద్యాసంస్థలను నడుపుతూ, రాష్ట్రం మొత్తంలో సుమారు లక్షమంది నిరుద్యోగులకు జీవనభృతిని కలిపిస్తున్నారు. అంతేకాదు 7వ తరగతి చదివే ప్రతి విద్యార్థికి ఎగ్జంప్షన్ ఫీజు క్రింద రు. 200/-లు, 10వ తరగతికి చెందిన ప్రతి విద్యార్థికి ఎగ్జంప్షన్ ఫీజు క్రింద రు. 230/-లు ఫీజు చెల్లిస్తున్నారు. ప్రభుత్వ గుర్తింపు పొందిన విద్యా సంస్థలలో చదివే విద్యార్థులకు ఈ ఎగ్జంప్షన్ ఫీజు ఉండదు. ప్రభుత్వ విద్యా సంస్థల నుండి ప్రభుత్వానికి వచ్చే ఆదాయం కేవలం పరీక్ష ఫీజు మాత్రమే. వాటి మీద ప్రభుత్వం ఖర్చుపెట్టే మొత్తం మాత్రం ఎక్కువ. ప్రైవేటు విద్యా సంస్థలలో చదివే విద్యార్థులు మాత్రం ఎగ్జంప్షన్ ఫీజు, ఎగ్జామినేషన్ ఫీజు

రెండూ చెల్లిస్తారు. అయితే వాటి మీద ప్రభుత్వం నయాపైసా కూడా ఖర్చు చేయటం లేదు. ఈ వాస్తవం చాలా మందికి తెలియదు.

ఈ సందర్భములో మరో నగ్నసత్యము కూడా తెలియజేయుచున్నాను. మాజీ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ జనార్ధనరెడ్డిగారు ది. 9-7-1991న ఒక వాస్తవమును ప్రకటించారు. ప్రభుత్వం 1వ తరగతి నుంచి 5వ తరగతి వరకు ప్రభుత్వ విద్యా సంస్థలలో చదివే ప్రతి విద్యార్థి మీద నెలకు రు. 130/- నుంచి రు. 150/-లు దాకా ఖర్చు చేస్తున్నదని, అదేవిధంగా 7వతరగతి విద్యార్థిమీద రు. 240/-లు ఖర్చుచేస్తున్నదని, 8,9,10 తరగతులకు చెందిన ప్రతి విద్యార్థి మీద రు. 530/-లు దాకా ఖర్చు చేస్తున్నదనే సత్యాన్ని వెల్లడిచేసారు. అయితే ప్రైవేటు విద్యా సంస్థలవారు గాని, కాన్వెంటువారుగాని ఇంతకన్నా ఎక్కువ ఫీజులు వసూలు చేస్తున్నారా? తక్కువ చేస్తున్నారా? ఒకవేళ ఎవరైనా ఎక్కువగా వసూలు చేస్తుంటే, అట్టి విద్యాసంస్థలు రాష్ట్రం మొత్తంలో ఎన్నిఉన్నాయి? ఈ వాస్తవమును పరిశీలించమని విమర్శనలు చేసే వారికి వినయపూర్వకంగా మనవి చేస్తున్నాను.

ఈనాడు విద్య సామాన్యునికి అందుబాటులో లేకుండాపోతున్నదని, ఖరీదైపోతున్నదని మరికొందరు విమర్శిస్తున్నారు. ఈ విమర్శనలో కొంత వాస్తవమున్నది. అయితే ఫీజులు చెల్లించుకోలేని బీద, పేదవిద్యార్థులు, వారు ఏకులమునకు చెందిన వారైనా సరే, అట్టి వారికి ఉచితంగా విద్యను అందించవలసిన బాధ్యత ముఖ్యంగా ప్రభుత్వం మీద ఉన్నది. అంతేకాదు ప్రైవేటువిద్యాసంస్థలవారు కూడా అట్టివారికి కొంతమందికైనా అవకాశం కలిపించాలి. అయితే ఇక్కడ ఒక సమస్య ఉన్నది ఒకవేళ ప్రభుత్వ విద్యా సంస్థలలో ఉచితంగా చదువు చెప్పినా అక్కడ ఆశించినంత మంచి చదువు లభించటం లేదనే విమర్శన కూడా ఉన్నది. ఫీజులు లేనిచోట చదువులేదని, చదువు ఉన్నచోట ఫీజులు కట్టి చదువుకోలేక బీద పేద విద్యార్థులు నానా అవస్థలు పడుతున్నారనే విమర్శన కూడా ఉన్నది. ప్రభుత్వ విద్యా సంస్థలలో అధ్యాపకుల చేత శ్రద్ధగా చదువు చెప్పించే బాధ్యత విద్యాశాఖాధికారులది. అధికారులు, అధ్యాపకులు తమ విద్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తే ఈ సమస్య పరిష్కారమవుతుంది. దీనికి ప్రభుత్వం అవసరమైన శ్రద్ధను కూడా గైకొనాలి.

పిల్లలనుండి వసూలు చేసే ఫీజుల నుండి అధ్యాపకుల జీతాలు, స్టేషనరీ, ఫర్నీచర్, అద్దెలు వగయిరాలు ప్రైవేటు విద్యా సంస్థలే భరించాలి. ప్రభుత్వం నుండి ఎట్టి సహకారం ఈ విద్యాసంస్థలకు ఉండదు. అయితే ఈనాడు ప్రభుత్వ విద్యా సంస్థలలో చదివే విద్యార్థులు, ప్రైవేటు విద్యా సంస్థలో చదివే విద్యార్థుల మధ్య ప్రభుత్వం వివక్షత చూపుతున్నది. అది మంచిది కాదు. మెరిట్ స్కాలర్‌షిప్పులు మరియు ఇతర సౌకర్యములు ప్రభుత్వ విద్యాసంస్థలలో చదివే విద్యార్థులకు ఏవిధంగా ప్రభుత్వం యిస్తున్నదో, అదే విధంగా ప్రైవేటు విద్యా సంస్థలలో చదివే విద్యార్థులకు అట్టి సౌకర్యములు కలుగ జేయటం సముచితం. విద్యార్థుల మధ్య వివక్షత చూపించ వద్దని ప్రభుత్వానికి ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను.

ఈనాడు ప్రైవేటు విద్యాసంస్థల పాత్ర మన రాష్ట్రంలో అత్యంత కీలకమైనది. గణనీయమైనది. ఈనాడు వాటి ఆవశ్యకత కూడా ఎంతైనా ఉన్నది. ప్రైవేటు విద్యా సంస్థలే గనుక లేకపోతే బాలబాలికల విద్య కుంటు పడటం ఖాయం. అయితే చాలా కొద్ది పెద్ద ప్రైవేటు విద్యా సంస్థలలో కొన్ని అక్రమాలు చేస్తున్నమాట వాస్తవమే. అయితే అందులో ఎక్కువ భాగం ప్రభుత్వం చేత గుర్తింపు పొందిన విద్యాసంస్థలే ఉన్నాయి. అయితే ఈ కొద్దింటిని దృష్టిలో పెట్టుకొని అన్నింటిపైన చర్యలు గైకొనవద్దని మనవి చేస్తున్నాను. అక్రమాలను అనుసరించే విద్యాసంస్థలు, అవి ఏవైనా సరే వాటి మీద కఠినమైన చర్యలు గైకొనటానికి ఎవరికీ ఎట్టి అభ్యంతరం ఉండదు. అయితే వాటిని మాత్రమే దృష్టిలో పెట్టుకొని మొత్తం ప్రైవేటు విద్యా రంగమునకు హాని తలపెట్టవద్దని ప్రత్యేకంగా ప్రభుత్వానికి, మేధావులకు మనవి చేస్తున్నాను. *

## ధర్మవ్యాధోపాఖ్యానము

"పాపం చేత్ పురుషః కృత్వా
కళ్యాణమభిపద్యతే
ముచ్యతే సర్వపాపేభ్యో
మహాభ్రేణేవ చంద్రమాః"

మానవుడు తొలుత పాపకార్యాలు చేసినా, తరువాత పుణ్యకర్మలను ఆచరించినట్లయితే, మహా మేఘము నుండి విడివడ్డ చంద్రునివలె సమస్త పాపాల నుండి విముక్తిని పొందుతాడు.



# మితం - హితం



"కుర్వాణః కృషిమమితాం మితంశయానః
భుంజానో మితమమితం పరందదానః
జానానో బహువిషయాన్ మితం బ్రువాణః
ఉత్కర్షం భువిలభతే సవర్ధమానః"

ఎక్కువగా పనిచేయడం, మితంగా నిద్ర పోవడం, మితంగానే తినడం, ఇతరులకు ఎక్కువగా పెట్టడం, అనేక విషయాలు తెలిసిఉండి కూడా మితంగానే మాట్లాడడం - ఈ పనులు ఎవరైతే చేస్తారో, వారు లోకంలో వృద్ధిలోకి వస్తారు, ఉన్నతస్థితి పొందుతారు. కనుక పైన చెప్పిన పనులు తప్పక ఆచరించాలి.

"అతి తిండి మతిహాని, మిత తిండి అతి హాయి. అతి భాష మతిహాని, మిత భాష అతి హాయి" అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ఇది ఎంతో అనుభవం తో చెప్పిన మాట. ఎక్కువగా పనిచేయటం, తక్కువగా మాట్లాడటం మంచిలక్షణం. కాని ఈనాడు 'మాటలు కోటలు దాటుతున్నాయి గాని, కాళ్ళు గడపలు దాటటం లేదు'. ప్రస్తుత పరిస్థితులలో చాలామంది నడత ఈ విధంగానే ఉంటున్నది. "వట్టి మాటలు కట్టి బెట్టి, గట్టి మేల్ తలబెట్టవోయ్" అన్నాడు గురజాడ మహాకవి. కనుక మాటల కంటే చేతలకే ప్రాధాన్యత యిచ్చినప్పుడు దేశం పురోభివృద్ధిగాంచుతుంది.

ఇకపోతే తాను మితంగా తిని ఇతరులకు ఎక్కువగా పెట్టడం. ఇది మన సంప్రదాయం, మన సంస్కృతి. అయితే ఈనాడు 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అనే సామెతను ఎక్కువమంది పాటిస్తున్నారు. ఎన్ని సంపదలున్నా తామే అనుభవిస్తున్నారు గాని, పిల్లికి కూడా బిచ్చం పెట్టడం లేదు. ఇచ్చుకోవటంలో ఉన్న ఆనందం, పుచ్చుకోవటంలో లేదని భగవాన్ సాయి పదేపదే చెబుతుంటారు. దీనిని ఆచరణలో పెట్టినవారే ఆనందాన్ని అనుభవించగలుగుతారు.

ఒక్క బాలలకు, వృద్ధులకు మాత్రమే నిద్ర, విశ్రాంతి అవసరం గాని, మిగిలిన వారు నిద్రలో కాలమును అనవసరంగా దుర్వినియోగ పరచరాదు. అతి నిద్ర అలసత్వాన్ని, సోమరితనాన్ని పెంచుతుంది, బుద్ధిని మందగింప చేస్తుంది, శరీరం బరువెక్కుతుంది. ఏ పనీ చేయాలనిపించదు. ఇది తమో గుణ లక్షణం.

ఏమీ తెలియక పోయినా, అన్నీ తెలుసునని భావిస్తూ అహంకారంతో అతిగా మాట్లాడుతుంటారు కొందరు. ఇది ఏమాత్రం మంచిది కాదు. "నిండుకుండ తొణకదు" అన్నట్లుగా అన్ని విషయాలు తెలిసిన వారు మాత్రం మితంగా, హితంగా సత్యమైన మాటలను మాత్రమే మాట్లాడుతుంటారు.

కనుక అధికంగా పనిచేయుటం, మితంగా హితంగా మాట్లాడటం; తాను తక్కువ తిని, ఇతరులకు ఎక్కువగా పెట్టడం మరియు మితంగా నిద్రపోవడం లాంటి పనులు ఎవరైతే చేస్తారో వారు అభివృద్ధిలోనికి వస్తారు.

- సాయిప్రియ

## "సర్వ ఆధారభూతుడు సత్యసాయి"

"ఓయని పల్కేటి ఒప్పైన సాయికి
రెండు చేతుల నిండ దండమిడుదు
తలచి నంతనె వచ్చి తలపున వసియించు
సాయిబ్రహ్మకు నా సర్వమిడుదు
నాచేత నున్నట్టి నలుసంత పనియైన
చేనిచ్చు సాయికి సేవజేతు
ఎందుజూచిన నిండుగందునే కనిపింప
అభయమడిగి దాసుడగుదు నేను
ఇహపరంబుల రెండింటి ఈశ్వరుండు
కల్ల నిజముల కాపాడు వల్లభుండు
అతడె నాదిక్కు; నా చూపు అతనివైపె
"సర్వ ఆధారభూతుడు సత్యసాయి"

- కర్రి క్రిష్ణమ్మ, వీరఘట్టం

# విశ్వనాథ - ఆరుద్రగార్ల ఛలోక్తులు

ప్రముఖ పరిశోధకులు ఆరుద్రగారు రచించిన ఆరుద్ర 'శుద్ధమధ్యాక్కరలు' అను గ్రంధాన్ని శ్రీమతి కె. రామలక్ష్మి గారు ప్రచురించారు. ఆగ్రంధంలో నామాటగా ఒక్కమాట. అంటే, 1960-70 ప్రాంతంలో ఆరుద్రగారు రచించిన ఈకృతి విశ్వనాధ వారికి అంకితమివ్వబడిందన్నారు. ఈ మధ్యాక్కరలకు కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి లభించింది. రామలక్ష్మిగారి మాటల్లో చదవండి

"విశ్వనాధవారిదీ ఆరుద్రదీ" లవ్ హేట్ అనుబంధం అనాలి. ఆరుద్ర విశ్వనాధవారి కొన్ని ప్రయోగాలకు మురిసిపోవడం కద్దు. విశ్వనాధవారు కవిసమ్మేళనంలో ఆరుద్రని శభాష్ అని భుజం తట్టిన సందర్భాలూ కద్దు. కవితావసరాల విషయంలో తూర్పు పడమరలైన వీరు ఇరువురు స్నేహితులే. కలసినపుడు గంటల కొద్దీ మాట్లాడుకోవడం నాకు తెలుసు. అది వాదించుకోవడం అన్నా తప్పు లేదు. కాని ఒకరినొకరు నిందించుకోవడం మాత్రం కాదు. విశ్వనాధవారికి ఆరుద్రపై గొప్ప కినుకకి కారణం అతను తన సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రను గ్రాంధిక భాషలో రాయలేదని.'ఇది చదువగల్గిన సామాన్యులకోసం పండితుల కోసం' కాద?ని ఆరుద్ర అభిప్రాయం. తెల్లని బట్టలు వేసుకొని కన్పిస్తే 'రావోయ్ పుంభావ సరస్వతీ' అంటూ ఆయన పిలవడం, ఆంధ్ర సారస్వత పరిషత్ ఆవరణలో జరుగుతున్న ఒక సభలో నన్ను ఆరుద్ర వారికి పరిచయం చేస్తూ 'నా భార్యామణి' అన్నారు. దానికి విశ్వనాధ నన్నొక సారి చూసి సన్నగానవ్వి ఆరుద్ర చేయిఅందుకొని 'పలువురు భార్యలు కలరేని ఒకతె మణియగు ఒక్క భార్యను పెట్టుకొని మణి అంటావేమిటోయ్, పెళ్ళాంఅను' అని గట్టిగా నవ్వేశారు. చమత్కారంగా మాట్లాడటం, అవసరం అయితే అంకుశం విసిరినట్లు మాట్లాడటం విశ్వనాధ తీరు. శత్రువు-మిత్రుడు తేడా లేకుండా నవ్వుతూ పల్కరించడం మాట్లాడటం ఆరుద్రతీరు. 'ఎదుటివారితో విరసంగా మాట్లాడటం ఆరుద్ర అలవాటులేని విద్య. అలాఅని తను నమ్మిన దానిని చెప్ప కుండనూ వుండడు. ఇందువల్ల మిత్రులు తక్కువ, శత్రువులు ఎక్కువేమో ఆరుద్రకు నాకు తెలియదుకాని ఆరుద్రను వ్యక్తిగా అభిమానించేవారు ఎక్కువే. అతని సాహితీ వ్యవసాయం అతనికా అభిమాన బృందాన్ని చేకూర్చిందనడం అబద్ధం కాదు.

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**


## శ్రీవాణి సాంస్కృతిక మాసపత్రిక Form IV (See Rule - 8)

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రచురణ స్థలము | : | మచిలీపట్నము |
| 2. | ప్రచురణ ఎన్నాళ్ళకు | : | మాసమునకు |
| 3. | ముద్రాపకుని పేరు | : | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 4. | ప్రచురణకర్త పేరు | : | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 5. | సంపాదకునిపేరు | : | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 6. | చిరునామా | : | 24-52, రామానాయుడుపేట, మచిలీపట్నం |
| 7. | ముద్రణాలయము | : | శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ |
| 8. | భాగస్తులు | : | ఎవరూ లేరు |

కొమరగిరి కృష్ణమోహనరావు అనే నేను పై విషయములన్నియు యదార్థమని తెలుపుచున్నాను.

మచిలీపట్నం
ది. 27-2-2000

ప్రచురణ కర్త సంతకం

# పుత్ర వ్యామోహం

లోకకళ్యాణం కోసం పుత్రవాత్సల్యాన్ని త్యాగం చేశాడు ఆనాడు దశరథ మహారాజు. అలాగే ఈనాడూ దేశం కోసం కన్న బిడ్డలను సైతం త్యాగం చేస్తున్న తల్లి తండ్రులెందరో ఉన్నారు. వారందరూ మహనీయులే! కాని పెడదారి పట్టి పోతున్న తనయుల తప్పులను సరిదిద్దలేని తల్లితండ్రులూ ఉన్నారు! బిడ్డలపై మమకారమో, ప్రేమోగాని అలాంటి వారు తమ బిడ్డల జీవితాలు నాశనము కావటానికే సహాయపడుతున్నామని తెలుసుకోలేక పోతున్నారు. అట్టివారిది పుత్రవాత్సల్యమనిపించుకోదు! అది పుత్ర వ్యామోహము! ధృతరాష్ట్ర మహారాజు పుట్టంధుడు! దుర్యోధన జనన సమయంలో గోచరించిన దుశ్శకునముల ఫలితముగా కౌరవ వంశక్షయమగుననియు, అందుచే ఆతనిని పరిత్యజించుట శ్రేయస్కరమనియు విదురుడు హితోపదేశం చేశాడు. పుత్ర వ్యామోహంతో ఆ హితోప దేశాన్ని విననట్లే ఊరుకున్నాడా మహీపతి! మనోవేదనతో చిక్కి శల్యమైపోతున్న దుర్యోధనుని వెంట బెట్టుకొని శకుని ధృతరాష్ట్రుని దగ్గరకు చేరాడు! తనయుడి పరిస్థితిని విన్న తండ్రి అదిరిపడి, కుమారుని దగ్గరకు తీసికొని స్పృశించాడు.

"నాయనా! దేవేంద్రభోగముతో సమస్త భోగభాగ్యాలు అనుభవిస్తున్న నీకేమి లోటు? నీవు శుష్కించిపోవుచున్నా వని శకుని ఆందోళన చెందుతున్నాడు. అందులకు కారణమేమో నాకు చెప్పవా?" అంటూ అనునయించాడు.

"తండ్రీ! పాండుకుమారుల ఐశ్వర్యముతో దేవేంద్రుని విభవమైనా సరిపోదు. ఆ యుధిష్టరుని ఐశ్వర్యము వర్ణనాతీతము. ఆ దివ్యభాగ్యం తలచుకొన్నంతనే నా గుండె జలదరిస్తోంది. ఇతరుల ప్రాభవం సంవర్శించి, హీనాతి హీనమై జీవచ్ఛవం వలె జీవించగలనా?" అంటూ దుర్యోధనుడు తన మనోవేదనను వెలిబుచ్చాడు. "కౌరవా ధీశ్వరా! నీకా చింతయేల? ఆ పాండు నందనుల ఐశ్వర్యము సర్వమును క్షణములో నపహరించు ఉపాయముగలదు. ద్యూతక్రీడలో అవలీలగ ఆ యుధిష్టరుని ఓడించి ఆ వైభవ మును నీకర్పించగలను" అంటూ శకుని ధైర్యవచనములు పల్కాడు! ఆ పలుకుల కానందపడిన దుర్యోధనుడు శకుని ఆలోచన నంగీకరించవలసినదిగా తండ్రిని వేడుకొన్నాడు!

"నాయనా!... దుర్యోధనా!.. ఈవిషయమై నీతి శాస్త్ర విశారదుడు-విదురునితో సంప్రదించి, నిర్ణయించెదమని' ధృతరాష్ట్రుడు పల్కెను. "తండ్రీ! విదురుడు పాండవ పక్షపాతి! శకుని మామ చెప్పిన దంతయు, కపటోపాయమని, అన్యాయమని అభ్యంతరము లేవనెత్తును. కావున ఈ క్షణమే ఈ నిర్ణయానికి అంగీకారము తెలుపవలసినదిగా ప్రార్థిస్తున్నాను. లేనిచో నేనిప్పుడే యిక్కడే అగ్ని జ్వాలల కాహుతి కాగలను" అంటూ బెదరించాడు.

పుత్రుని సంతృప్తి పరచుటకై తక్షణమే ఒక అపూర్వ సభా భవనమును నిర్మించవలసినదిగా ఆజ్ఞాపించాడు ధృతరాష్ట్రుడు! సభాభవన నిర్మాణ సమయములో ఏకాంత

**సోమంచి రామం**

స్థలములో విదురుని రప్పించి, తన పుత్రుని సంకల్పము వెల్లడించాడు! ధృతరాష్ట్రుని పలుకులు విని విస్తుబోయిన విదురుడు వెంటనే తన అభిప్రాయాన్ని చెప్పసాగాడు.

'మహారాజా! కపటోపాయంతో కురు పాండవ కుమారుల మధ్య వైరము కల్పించుట న్యాయము కాదు దీనికి నేనెంత మాత్రమంగీకరించను. వెంటనే ఈ దుస్తంత్రం విరమింపజేసి, కౌరవ కుల సంరక్షణ చేయగోరు చున్నాను. నా మాటలను పెడచెవిని పెట్టవలదని' ప్రార్థించాడు. అంతట ధృతరాష్ట్రుడు తనయుని పిలిచి, "నాయనా! ఈ జూదమేల? దీనివలన మీలో మీకనేక వైషమ్యములు ఉద్భవించగలవు. అదియునుగాక విదురునకీ కపటద్యూత పద్ధతి రుచించలేదు" అని చెప్పెను. "మహారాజా! ఒకరి యిష్టాయిష్టాలతో మనం కార్యము నిర్వహించుకోగలమా? అయిననూ ఈ సమయంలో పాండవ పక్షపాతి విదురుని మాట పాటించరాదు. కనుక దీనికంగీకరించి ద్యూతమునకు ధర్మరాజును వెంటనే తోడ్కొనిరమ్మని విదురునికే ఆజ్ఞాపించండి!' అని తన నిర్ణయాన్ని చెప్పాడు దుర్యోధనుడు. అంతట ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహానికి దాసుడై, ఎట్టకేలకు అందుల కంగీకరించి, కురుక్షేత్ర సంగ్రామానికి, కౌరవ వంశక్షయానికి, కారకుడయ్యాడు. ✻



# సోమవారము - సదాశివుడు



"సోమవారము నేడు సోమశేఖరు పూజ చేయగరాదటే ఓ మనసా కామహరుని హరుని కాత్యాయనీ విభుని ప్రేమ పూజించవె ఓమనసా!"

సోమవారము శివునికి ప్రీతికరమైనరోజు. శివం అనగా మంగళకరమైనది. అందరికి శుభమును చేకూర్చునది. శివుడు అభిషేక ప్రియుడు. నమక చమకములతో ఏకాదశ రుద్రాభిషేకము ప్రతిదినము చేసిన వారికి జన్మజన్మాంతర పాపములు నశిస్తాయి. శివుడు అనగా ఒక్కడే కాదు. శివశక్తి సమ్మిళిత స్వరూపమే శివమూర్తి. శివశక్తులను విడదీయటానికి వీలులేదు. వారు ఆదిదంపతులు. ప్రకృతి లేనిదే పురుషుడు లేడు. పురుషుడు లేనిదే ప్రకృతి లేదు. ఓంకార రూపుడయిన పరమేశ్వరుడు, అద్భుతము. అప్రమేయము, అనంతము, అయిన జ్యోతిస్వరూపుడు. అయితే ఆ నిర్గుణ,నిరాకార, నిరంజనమయిన తేజఃపుంజాన్ని దేవతలు సహితం దర్శించ లేకపోయినారు. దేవతల ప్రార్థనపై సర్వశుభంకరుడైన భోళా శంకరుడు తన తేజో రూపాన్ని అర్చారూపంలో అనగా లింగా కృతిలో ఆవిర్భవింప చేశాడు. ఆ పరమపవిత్రమయిన లింగోద్భవ కాలమే మహా శివరాత్రి పర్వదినము. విష్ణు బ్రహ్మలు సహితం ఆ లింగము యొక్క తుదిమొదలు తెలుసుకొనలేకపోయినారు.

అటువంటి మహాదేవుని మనము ఏ విధముగా అర్చన చేయగలము? సముద్ర మధన సమయంలో లోకాలను గడగడ లాడించిన మహాకాలకూట విషమును లోక కల్యాణమునకై తన కంఠము నందు నిలిపి గరళ కంఠునిగా ప్రసిద్ధిచెందాడు పరమశివుడు. మనలోని అజ్ఞానమును నాశనము చేసి జ్ఞాననేత్రమును తెరిపిస్తాడు త్రినేత్రుడు. ఎన్ని భోగాలు అనుభవించినా చివరకు మిగిలేది బూడిదేనని నిరూపిస్తాడు "భస్మభూషితాంగుడు" అర్ధనారీశ్వరుడు భిన్నమైన ఆకృతులుగల ఇద్దరు కొడుకులకు తండ్రి, విభిన్న మనస్తత్వాలుగల వాహనములు గల జగత్కుటుంబము సదాశివుని కుటుంబము. భిన్నత్వంలో ఏకత్వం అంటే ఇదేనని తెలియజేస్తారు ఆ ఆదిదంపతులు.

విశ్వవిరాట్ స్వరూపుడయిన ఆ విశ్వేశ్వరుని ఏవిధముగా పూజింపగలము? సర్వత్రా నిండియున్న ఆ పరమాత్మ స్వరూపమును వాక్కు చేత వర్ణించుట మనసుతో చింతించుట సాధ్యమా? **'యతో వాచోనివర్తన్తే అప్రాప్య మనసాసహ'** అని శృతి వాక్యము. ఒక్కచోట ఉన్నవానిని అయ్యా! దయచేయండి! అని మరొక చోటుకు ఆహ్వానించ వచ్చును. అంతట నిండి యున్నవానిని 'ఆవాహనము ఎచ్చటికి చేయగలము?' అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః సర్వత్ర నిండి యున్న స్వామికి 'ఆసనము' ఎట్లు సమర్పింపగలము? **"సర్వతః**

**కొమరగిరి జయప్రద**

**పాణపాదంతత్ సర్వతో2క్షి శిరోముఖం"** ముల్లోకములోను నిండియున్న స్వామి పాదములకు, సర్వసృష్టినిజేయు స్వామి హస్తములకు 'అర్ఘ్యపాద్యము'లను ఏవిధముగా ఇవ్వగలము? విశ్వముఖుడవయిన నీకు 'ఆచమనార్థము' ఎంత జలము తీసుకొనిరాగలము? గంగను తలపై ధరించి గంగాధరుడవైన నిత్యశుద్ధుడవయిన నీకు స్నానము చేయించ మా తరమా? అనంతుడవయిన నీకు 'వస్త్రము' ను సమర్పింపగలమా? శివా! మహాదేవా! సర్వాంగముల యందు సర్పాభరణములను ధరించిన నీకు ఏ ఆభరణ ములను సమర్పింపగలము? సద్గుణములనే సుగంధమును ఎల్లెడల వ్యాపింపజేయు నీకు ఏ గంధము సమర్పింప గలము? కలువలరేడును అందముగా అలంకరించుకున్న నీకు ఏ పుష్పములతో పూజింపగలము? జ్యోతిస్వరూపుడవు స్వయం ప్రకాశుడవు అయిన నీముందు ఈ చిన్ని 'దీపపు' ప్రమిదను ఎలా పెట్టగలము? నిత్యతృప్తుడవు నిన్ను కొలిచిన వారికి కొంగుబంగారమయినటవంటివాడవు అయిన నీకు 'నైవేద్యము' ఏమి సమర్పింపగలము? ఆకాశమే శిరముగా గల నీకు 'ఛత్రము'ను పట్టగలమా? విశ్వవిఖ్యాత నటరాజు వైన నీఎదుట మా 'నాట్యము' కుప్పిగంతులు కాదా? సామగాన ప్రియకరుడవయిన నీముందు మా గానము

ఒక గానమా? స్వామీ! ఇవన్నియు నీకు మేము సమర్పిస్తున్నామన్న భావము చాలా హాస్యాస్పదముగా ఉన్నది. బాల్యచేష్టవలె ఉన్నాయి. స్వామీ ఇవి అన్నియు నీకు అవసరము లేదు.

ఎందుకనగా,

"పూవులెన్నియొ తెచ్చి పూజ చేసినగాని
మెచ్చుకొనడు స్వామి పుచ్చుకొనడు
హృదయకమల మివ్వ సదయుడై గ్రహించు"

అన్నారు స్వామి! కాబట్టి మనము నిర్మలమైన మనసుతో, నిశ్చలమైన భక్తితో ఆ సదాశివుని సేవించుకోవాలి. శివునికి ఇష్టమయిన రోజు సోమవారము. సదాశివునికి ప్రీతికరమైనది, శైవులకు పవిత్రమయినది, సర్వులకు శుభకరమయినది సోమవారము. కార్తీక మాసములో వచ్చే సోమవారము చాలా పవిత్రమయినది. ఆర్ద్రానక్షత్రముతో కూడిన సోమవారము కూడా చాలా విశేషమయినది. ప్రతి అమావాస్య ముందు వచ్చే చతుర్దశిని మాసశివరాత్రి అంటారు. మాఘ కృష్ణ చతుర్దశి 'మహాశివరాత్రి' పర్వదినము. కాబట్టి ఏవిధముగానయినా సోమవారము పరమశివుడికి చాలా ప్రీతికరమైన వారము. సోమవారము నాడు శివశక్తి స్వరూపుడయిన ఆ సదాశివుని సర్వులూ సేవించి, పూజించి తరించాలి. ⊕

సైన్స్‌వాణి - 36

# జంతువులలో అమ్మవారు

చికెన్ పాక్స్ అన్న పేరుతో చాలామందికి పరిచయం అయిన వ్యాధిని మనం 'ఆటలమ్మ' అనీ, 'చిన్న అమ్మవారు' అనీ అంటాం. ఈ వ్యాధి జంతువులకు కూడా వస్తుందా అంటే వస్తుందనే చెప్తున్నాయి శాస్త్రవేత్తల పరిశోధనలు. గతంలో శాస్త్రజ్ఞులు ఈ విషయమై అంతగా పట్టించుకోలేదు. అయితే కొద్దికాలం క్రిందట యూరపులో పిల్లుల్లో ఆటలమ్మ విస్తారంగా రావడమే కాక దానివల్ల వాటిని పెంచి పోషించే యజమానులకు, ఇతర కుటుంబ సభ్యులకు వివిధ రుగ్మతలు వస్తుండడంతో శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలను ముమ్మరం చేశారు.

పిల్లులకు ఇతర జంతువులకు వచ్చే ఆటలమ్మను "కౌపాక్స్" అంటారు. ఈ వ్యాధి సోకిన పిల్లులను సాకే వారికి జ్వరం రావడం, బద్ధకం ప్రబలడం, చర్మ వ్యాధులు కలగడం వంటి రుగ్మతలు వచ్చే అవకాశం ఉందని శాస్త్రజ్ఞులు గ్రహించారు. వీరి పరిశోధనలు మరెన్నో విషయాలను బహిర్గతం చేశాయి. సామూహికంగా జంతువులకు వచ్చే ఆటలమ్మకు "ఆర్థోపాక్స్" అని నామకరణం చేశారు. కొద్ది సంవత్సరాల క్రిందట బ్రిటిష్ జూలోని చిరుత పులులకు, మాస్కో జూలోని చిఱుతలకు, అలాగే రాటకడాం జూలోని ఒకాపే అనే జంతువులకీ కూడా ఆటలమ్మ వచ్చింది. ఇదేవిధంగా జర్మనీలో ఎన్నో ఏనుగులు కూడా ఈ వ్యాధి బారిన పడ్డాయి. దీనిని బట్టి సృష్టిలో అన్ని జంతువులకు ఆటలమ్మ రాగల అవకాశం ఉందని తేలింది. అయితే సుగుణమేమిటంటే ఈ వ్యాధి తీవ్రంగా కాకుండా సామాన్యంగానే వస్తుంది. అదికూడా ఒక నెలలోపలే అదంతట అదే తగ్గిపోతుంది.

కె.ఆర్.కె. మోహన్

పిల్లులు పొలాల్లో సంచరించే ఎలుకల్నీ, చుంచుల్నీ వేటాడుతాయి. వీటికి ఆటలమ్మను కలిగించే వైరస్ సులువుగా సోకుతుంది. అందువల్ల ఈ వైరస్ కలిగిన ఎలుకల్ని వేటాడడం వల్ల, చంపి తినడం వల్ల ఆ వైరస్ పిల్లుల దేహాల్లో ప్రవేశించి వాటికి కూడా ఆటలమ్మ వస్తుంది. పంటపొలాలు, పల్లె పట్టులలో ఎక్కువగా ఉంటాయి.

కనుక పల్లెలలో సంచరించే ఎలుకలకే ఎక్కువగా ఆటలమ్మ వస్తుంది. ఇదే విధంగా శిశిర ఋతువులో ఈ ఎలుకల సంఖ్య బాగా ఎక్కువగా ఉంటుంది. కనుక, ఆ ఋతువులో పిల్లులకు కూడా ఎక్కువగా వస్తుంది. దీని వల్ల ఎలుకల ద్వారానే పిల్లులకు ఆటలమ్మ వస్తోందన్న వాస్తవం ధృవపడింది. పిల్లుల విషయం తేలింది కనుక ఇంక మిగిలిన జంతువులకు ఏవిధంగా ఆర్థోపాక్స్ వస్తోందన్న విషయంపై పరిశోధనలు జరుపుతున్నారు శాస్త్రవేత్తలు. ⬟

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# బాలాజి వికలాంగుల సంస్థ (బర్డ్)

## నిరంతర సేవా కార్యక్రమం

తిరుమల తిరుపతి దేవస్థానం వారు, శారీరక వికలాంగములతో బాధపడువారికి సేవచేస్తూ ఉపశమనం కలుగజేయుట కొరకై "బాలాజీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సర్జరీ రిసెర్చి మరియు రిహాబిలిటేషన్ ఫర్ ది డిస్‌ఏబిల్‌డ్" (బాలాజి వికలాంగుల సంస్థ) సంస్థను స్థాపించింది ఈ సంస్థ తి.తి. దేవస్థానం చేస్తున్న మానవ సేవకు 'ప్రధాన ప్రతీక'.

1985లో స్థాపించబడిన 'బర్డ్' సంస్థ ఆర్థోపెడిక్స్ (శల్యవైద్యం) రంగంలో అనేక విధాలుగా కృషి చేస్తున్నది కాన్‌జెనిటల్ అనోమలిస్, సెరిబ్రాల్ పల్సీ రోగులు మరియు పోలియో వ్యాధిగ్రస్థులకు ఈ ఆసుపత్రిలో విలువైన చికిత్సను చేస్తూ, నిరుపేదల సేవలో అంకితమై పూర్తి బాధ్యతలతో సేవలందిస్తున్నది

## బర్డ్ ప్రధాన అంశములు

❋ వెన్నెముక గాయాలకు సంబంధించిన చికిత్సలో అర్ట్ టెక్నాలజీ ఉపయోగించడం ❋ 300ల పడకల సామర్థ్యంతో నాలుగు ఆపరేషన్ థియేటర్లతో ఎయిర్‌కండిషన్‌తో కూడిన ఆసుపత్రి ❋ ఉచితంగా కృత్రిమ అవయవాల వితరణ, సహాయము, ఊతనందించుట ❋ "బర్డ్"కు అందించే అన్ని విరాళాలపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు. ❋ 5 లక్షల రూపాయలిచ్చిన దాతల పేర్లు ఫోటోలతో కూడ 'బర్డ్' ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడతవి ❋ ఒక సంవత్సరంలో (కాలండర్ ఇయర్) 5మందికి 3 రోజుల పాటు ఉచిత దర్శనం, హారతి కల్పించబడుతుంది. ❋ రు 10 లక్షలు లేదా పైగా విరాళమిచ్చిన దాత పేరు మీద ఒక గది నిర్మించబడుతుంది. ❋ రు. 5 లక్షలు, రు. 10 లక్షలు విరాళమిచ్చిన దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ పద్మావతి అమ్మవారల వెండిబొమ్మలు గల మెమెంటోలు ఇవ్వబడును

సహృదయులైన దాతలు మరియు సామాన్య ప్రజలు 'బర్డ్'కు అందచేసే విరాళాలు వివిధ ప్రాజెక్టుల అమలు ఉఛితంగా కృత్రిమ అవయవాల సరఫరా, ఉచితంగా ఆహారం, తగ్గింపు రేట్లతో రోగులకు ప్రయాణ సౌకర్యాలు కల్పించుట వినియోగించడం జరుగుతుంది విరాళాలను,



**కార్యనిర్వహణాధికారి, బర్డ్ ట్రస్టు, తి.తి. దేవస్థానములు, తిరుపతి - 517 501 వారి పేరుతో డిమాండ్ డ్రాఫ్టుల ద్వారా పంపవచ్చును.**

**డా॥ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఎ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి - 517 501.

# భగవంతుడు భక్తప్రియుడే గాని సులభప్రియుడు కాడు

"చావుపుట్టుకలేనట్టి శాశ్వతుండు
ఆదిమధ్యాంతరహితుడనాదివాడు
తాను పుట్టక చావక చంపబడక
సర్వదా సాక్షిభూతుడై వెలయుచుండు
ఆత్మయే బ్రహ్మ బ్రహ్మయే ఆత్మయగును"

"ఈ పుట్టపర్తి నిలయుడు కాపాడును
మిమ్ము ఎపుడు కరుణాకరుడు
చేబట్టి మిమ్ము బ్రోచును
ఏపట్లను మరువకుండు ఎఱుగుడు మీరు"

"భరతదేశము వేదాల పట్టుకొమ్మ
యజ్ఞయాగాది క్రతువుల కాటపట్టు
పెక్కుమహనీయులను కన్న పెద్దతల్లి
నీతినియమాల నేర్పిన త్యాగభూమి"

ప్రేమస్వరూపులారా!

నీతినియమాలకు భారతదేశము పుట్టినిల్లు. సత్య ధర్మాలకు మెట్టినిల్లు అట్టి భరతభూమియందు జన్మించిన మీరు చాలా అదృష్టవంతులు ఇది త్యాగభూమి, ఇది తపో భూమి. ఇది పుణ్యభూమి. అయితే ఇటువంటి పవిత్ర భూమిని భోగభూమిగా మార్చుకోవటానికి ఈనాడు ప్రయత్నిస్తున్నారు. మరొక భాగ్యభూమి అవసరంలేదు, భోగభూమి అవసరంలేదు, త్యాగభూమి అత్యవసరం. తపఃభూమి మానవుడు సాధనచేయడానికి కావాలి. కనుక ప్రతి భారతీయుడు కష్టపడి పనిచేయాలి. నడుమువంచి చెమటోడ్చి దేహకండరములు కరిగించి కార్యములలో పాల్గొనాలి. దీనినే Bend the Body, Mend the Senses, End the Mind అన్నారు. భరతభూమికి ముద్దుబిడ్డలైన మీరు మొద్దుబిడ్డలుగా మారకూడదు. చెడ్డబిడ్డలుగా మారకూడదు, ఉత్తమ బిడ్డలుగా మారాలి, ఆదర్శవంతులుగా మారాలి. అప్పుడే భరతమాత ఎంతైనా ఆనందిస్తుంది.

భరతభూమియందు పుట్టిన మీరు, మేము మానవులని చెప్పుకోవటమే ఒక Qualification (యోగ్యత). మీరు ఏ డిగ్రీలు సంపాదించకపోయినా ఫరవాలేదు. భరతమాత బిడ్డలమని చెప్పకోవటమే పెద్ద Qualification. భరతదేశంబు భాగ్యాలభూమి. అది ఎట్టి భాగ్యము? ఆధ్యాత్మిక భాగ్యము, ఆనందభాగ్యము, త్యాగభాగ్యము. ఇలాంటి భూమియందు పుట్టిన ప్రతి భారతీయుడు త్యాగానికి కంకణం కట్టుకోవాలి. సేవలు కర్తవ్యరీతిగా నిర్వర్తించాలి. Service is God అందులోనే ఉంటున్నాడు భగవంతుడు.

Who are you? అని ప్రశ్నించినప్పుడు నేను దైవము బిడ్డను, నేను దైవము యొక్క అంశమును, Divine Power (దివ్యశక్తి) నాయందున్నదనే ధైర్యంతో మీరు సమాధానం చెప్పాలి అనేకమంది దేవుడు ఎక్కడున్నాడని ప్రశ్నిస్తుంటారు. ఎక్కడ చూచినా ఉన్నాడు. "ఇందుగలడందు లేడను సందేహమువలదు, చక్రి సర్వోపగతుండు ఎందెందు వెదికి

## భగవాన్ సాయి ఉద్బోధ

చూచిన, అందందే కలడు" అని ధైర్యంగా చెప్పాలి. లేడన్నవాడికి లేడు. కాని ఉన్నాడన్నవారికి ఉన్నాడు. "No, Yes లు మీ నోటికిగాని, సాయికి సర్వము Yes Yes నీకు దేవుడులేడని నీవు చెప్పవచ్చు. నాకు దేవుడున్నాడు. నాకు దేవుడులేడని చెప్పడానికి నీవు ఎవరు? నీకు దేవుడు లేకపోతే లేడని నీవు చెప్పుకో! కాని నా దేవుడులేడని చెప్పడానికి నీకు అధికారంలేదు. ఈ విధంగా ధైర్యంగా చెప్పి మన సమాజధర్మాన్ని నిలబెట్టి, ప్రాచీన సంస్కృతిని పోషించడానికి ప్రయత్నించాలి. మీరు అబలలుకాదు బలులే. ధైర్యంతో, పట్టుదలతో ఏ కార్యమునైనా సాధించడానికి కంకణం కట్టాలి. భగవంతుడే మూడు కంకణాలు కట్టాడు. 1. ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 2. అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే... 3. మోక్షయిష్యామి మాశుచః. కనుక భగవంతుని బిడ్డలైన మీరుకూడా "1. దైవం ఉన్నాడు. 2. దైవమును నేను చూడగలను. 3. దైవముతో నేను ఏకంకాగలను" అనే మూడు కంకణములు కట్టాలి.

ఈనాడు 2000 సంవత్సర ప్రారంభం అంటున్నారు. కాని ఈ సంవత్సరం చాలా చెడ్డదని అనేకమంది

బోధిస్తున్నారు అసలు చెడు అనేది ఈ జగత్తులోనే లేదు ఆ చెడుయందే మంచికూడా ఉంటుంది కనుక మనం ఏమాత్రం చెడుతలపులు తలచరాదు. భగవత్ సృష్టియందు చెడు ఏరీతిగా రాగలదు? సర్వమూ భగవత్ సంకల్పముల నుండి పుట్టినవే భగవంతుని సంకల్పం చెడు అయితేకదా! చెడ్డకాలం రావడానికి. భగవత్ సంకల్పములు సర్వమూ మంచివే భగవంతుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు కనుక సర్వత్రా వ్యాపించినటువంటి భగవత్‌తత్త్వాన్ని చెడ్డ అని చెప్పటానికి వీలుకాదు. మంచి చెడ్డలు నీ దృష్టియందున్నవి గాని, సృష్టిలో ఎట్టి చెడ్డలేదు. ఈ సత్యమును విశ్వసించి, ఏది వచ్చినా దృష్టిదోషమేకాని, భగవంతుని సృష్టి దోషం కాదని ధైర్యంగా విశ్వసించాలి. ఇట్టి ధైర్యసాహసములు కలిగిన విద్యార్థులు అత్యావసరం.

ఈనాడు లోకంలో అనేక విధములైన బాధలకు గురిఅవుతున్నారు. కాని ఈ బాధలను లెక్కచేయక, ధైర్యంతో వాటిని తట్టుకొని, నెట్టుకొని, ముందుకు సాగినప్పుడే మానవత్వం ధన్యమవుతుంది దేనికీ మనం వెనుకంజవేయకూడదు. ప్రాణానికి ప్రమాదం సంభవించి నప్పుడు కూడా ధైర్యమును విడనాడరాదు. చావు అనేది ఒకసారేగాని, రెండుసార్లు కాదు. ఏ నాటికైనా చావక తప్పదు చావుకైనా సిద్ధమై ధర్మాన్ని రక్షించాలి. నీ కోసం కాదు, నీవు సృష్టించబడింది కూడా నీ కోసం కాదు దైవం కోసమే. సర్వమూ దైవము యొక్క సంకల్పమే. కనుక దైవసంకల్పంచేత సృష్టించబడిన మానవుడు, దైవ సంకల్పం చేతనే ఆ సృష్టిని సార్థకం చేసుకోవాలి

ప్రతి విద్యార్థి చదువుతోపాటు సంస్కారమును కూడా పెంచుకోవాలి. సంస్కారములేని చదువువలన ప్రయోజనం లేదు. చదువు, సంస్కారము రెండూ ఉన్నప్పుడే నెగిటివ్, పాజిటివ్ కలిసినప్పుడు విద్యుచ్ఛక్తి ఏ విధంగా ఉపయోగ పడుతుందో, అదేవిధంగా ఆ శక్తి సద్వినియోగమవుతుంది. కనుక దైవవిశ్వాసమును ధృఢంగా పెంచుకోవాలి. ఎవరు అడ్డుతలిగినా, ధైర్యంతో ముందుకు నడవాలి. మంచికి అనేక కష్టములు అడ్డుతగులుతుంటాయి. చెడ్డకు ఏ మాత్రం అడ్డు తగలవు. కాబట్టి అడ్డు ఎక్కువ తగులు తున్నప్పుడు, ఇవి నా మంచి కోసమేననే సత్యమును విశ్వసించాలి. రెండు బాధల మధ్యలోనే మనకు సుఖం ప్రాప్తిస్తుంది. The Pleasure is an Interval between two Pains అన్నారు. **'నసుఖాం లభ్యతే న సుఖం'** అన్నాడు వ్యాసుడు. సుఖముతో మనం సుఖమును అనుభవించ లేదు కష్టంచేతనే మనం సుఖమును అనుభవిస్తాం. కష్టమే లేకుండిన సుఖమునకు విలువలేదు. చీకటే లేకుండిన వెలుగునకు ప్రకాశమే లేదు. కాబట్టి కష్టములనేవి మానవు నకు సహజములని భావించాలి.

పాండవులు యుద్ధమునకు వెళ్ళే సమయంలో, తల్లి కుంతీదేవి కృష్ణునికి నమస్కరించి, నాకు ఒక కోరిక ఉన్నది అని అడిగింది అప్పుడు కృష్ణుడు నీ కోరిక ఏమిటి? అని అడిగాడు "నాకు నిరంతరం నిన్ను మరువనటువంటి భక్తి, కష్టములు అనుభవించేశక్తి కావాలి. జీవితమంతా నాకు కష్టములనే అందించు. కష్టములలోనే నిన్ను స్మరించడానికి వీలుంది. సుఖములలో నేను ఏ మాత్రం నిన్ను స్మరించను. పాండురాజు ఉన్నప్పుడు, ఆనాడు సర్వసుఖములు అనుభవించాను. ఆనాడు నిన్ను ఏ మాత్రం స్మరించలేదు. ఆయన గతించిన తరువాత నా కుమారులు పడుతున్న బాధలను చూచి, నేను కష్టములే మంచివనుకున్నాను. ఈ కష్టసమయం లోపల నిన్ను అనేక పర్యాయములు స్మరిస్తూ వచ్చాను. అయితే నేను ఎన్ని కష్టములనైనా అనుభవించ డానికి సిద్ధంగా ఉన్నాను. కాని, నీ ప్రేమమాత్రం కించిత్ అయినా చలించగూడదు" అన్నది తన ప్రాణమంతయూ కృష్ణునిపైననే పెట్టుకుంది. పాండవులు అనుభవించిన కష్టములు మరెవ్వరూ అనుభవించలేదు. ఆ కష్టములు అనుభవించడంచేతనే వారు నిరంతరమూ దైవసన్నిధిలో ఉండగలిగారు. యుద్ధం అయిపోయిన 42 సం॥ల తరువాత అర్జునుడు ద్వారక నుంచి వస్తున్నాడు. అది ఎట్టి పరిస్థితి? అక్కడ యాదవకులంలో ముసలం పుట్టింది. కృష్ణుడు, బలరాముడు యాదవులందరూ మరణించారు. అర్జునునకు ఎదురుగా వెళ్ళి ధర్మజుడు, "మన కృష్ణుడు ఎట్లా ఉన్నాడు? మన సఖుడు, మన బంధువు ఎలా ఉన్నాడు?" అని అడిగాడు. అప్పుడు అర్జునుడు "ఇంకెక్కడి కృష్ణుడు" అని కూలబడ్డాడు. తల్లి దగ్గరకు వెళ్ళి ధర్మజుడు "అమ్మా! కృష్ణుడు మరణించాడు" అని చెప్పాడు. ఈ ఘోరవార్తను వినిన కుంతి 'కృష్ణుడు పోయాడా! కృష్ణుడు పోయాడా!'అంటూ ప్రాణం విడిచింది ధర్మజుడు చాలా విచారించాడు. "అమ్మా! కృష్ణుడు పోయాడంటే, వెదకటానికి వెళ్ళావా! ఆ కృష్ణుడులేని జీవితం మాకు మాత్రం ఎందుకు? ఇంతకాలం కృష్ణుడిచేతనే మనము జీవించాం, అనుభవించాం, ప్రఖ్యాతిని గాంచాం,

విజయాలను సాధించాం, కృష్ణుడి సహాయంవలననే సర్వము సాధించాం" అని చెప్పి భీమార్జుననకులసహదేవులను పిలిచాడు. 'నాయనా! మన ప్రయాణానికి సిద్ధం చేయండి' అని నకులసహదేవులకు చెప్పాడు. తల్లి అంత్యక్రియలకు ఏర్పాటు చేయమని భీమునికి చెప్పాడు. నీ కుమారునికి పట్టాభిషేకం కట్టటానికి అవసరమైన ఏర్పాట్లు చేయమని అర్జుననితో చెప్పాడు. ఇది ఏమి విచిత్రం. ఒక వైపున తల్లి అంత్యక్రియల ఏర్పాట్లు, రెండవవైపున అరణ్యానికి ప్రయాణం, మరొకవైపున అర్జునుని కుమారుని పట్టాభిషేక ఏర్పాట్లు. ఈ మూడు ఒకే దినమున ఏర్పడినాయి. ఎవరు చేయగలరు? ఎవ్వరూ చేయలేరు. భగవదానుగ్రహంవున్న ఈ భక్తులకు మాత్రమే చేయడానికి వీలైంది. ధర్మజుడు మాత్రమే ఈ సత్యకార్యములు చేయగలిగాడు. తల్లి అంత్యకార్యములు సమాప్తమైనాయి. అర్జునుని కుమారునికి పట్టాభిషేకం కట్టారు. పాండవులు అరణ్యానికి పయనమైనారు. ద్రౌపది కూడా వారిని అనుసరించింది. ఈ విధంగానే కష్టములయందు, సుఖములయందు ఐకమత్యాన్ని వారు ప్రదర్శించారు. అయితే ఈనాడు ఇలాంటి ఐకమత్యమును లోకంలో కోల్పోయినాం. ఇలాంటి ప్రేమతత్త్వాన్ని మనం ఈనాడు విస్మరించాం. కనుకనే మనకు ఈనాడు అనేక కష్టములు వెంటాడుతూ వస్తున్నాయి. కనుక మనం కష్టములకు ఏ మాత్రం చిక్కకూడదు, దక్కకూడదు. కష్టాలకు కంటినీరు పెట్టకూడదు. సుఖాలకు నవ్వకూడదు. సుఖాలకు పొంగక, కష్టాలకు క్రుంగక, క్రుంగి, పొంగని మనస్తత్త్వాన్ని అభివృద్ధిపరచుకోవాలి. ఇదియే భక్తుని యొక్క దీక్ష.

భక్తి.... భక్తి.... భక్తి..... అంటే ఏమిటనుకున్నారు. ఏదో పూజలు చేయటమా? జపములు చేయటమా? కాదు... కాదు..... ఇవన్నీ ఏవీకావు. భక్తి అనగా భగవంతునిపై ప్రసరించినటువంటి ప్రేమతత్త్వాన్ని తిరిగి వెనుకకు తీసుకోకూడదు. అదియే నిజమైనటువంటి భక్తి. ఇలాంటి శపథం చేసినటువంటివాడు, పరమభక్తుడు లక్ష్మణుడు. అతను అరణ్యాలకు వెళ్ళవలసిన అవసరంలేదు. రాముడు మాత్రమే అరణ్యాలకు వెళ్ళాలి. కాని "నా అన్నే నాకు ప్రాణం, నా అన్నే నాకు తండ్రి" అని తలంచి, రామునితో పాటు బయలుదేరాడు లక్ష్మణుడు. రాముడికి పూర్తిగా శరణాగతి అయినాడు. ఏది జరిగినా భగవత్ సంకల్పమేనని భావించు. ఇది మంచి, ఇది చెడ్డ అనేటటువంటి విచారణ ఏమాత్రం చేయవద్దు. సర్వమూ భగవంతుని యొక్క ఆజ్ఞయే. సర్వమూ ఉత్తమమైనటువంటిదే. సర్వమూ క్షేమమైనటువంటిదే. సర్వమూ సుఖమైనటువంటిదే. సర్వము ఆనందమయమైనటువంటిదే. కనుక ఈవిధమైనటువంటి సంతోషంతో మనం అన్ని కార్యములలో పాల్గొనాలి. ఇది కష్టము, ఇది సుఖము అనే చర్చకు ఏమాత్రం అవకాశం యివ్వకూడదు. ఇది చేయాలి, చేయి. ఎందుకు?

## పదాల పందిరి - 25

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | ■ | 3 | 4 |
| | ■ | 5 | | 6 | ■ | |
| 7 | | | ■ | 8 | | |
| ■ | ■ | | ■ | | ■ | ■ |
| 9 | | | ■ | 10 | | 11 |
| | ■ | 12 | 13 | | ■ | |
| 14 | | ■ | | ■ | 15 | |

### ఆధారాలు

**అడ్డం :**

1. ఒకరకమైన కోపం
3. దారి
5. 'నా' అనేవాడే చిరునామాలో లేడు
7. కాలేయము
8. మానవుడు
9. సైనికుడు
10. చెవులు
12. జాలి, దయ
14. బరువు
15. వికృతమైన గృహం

**నిలువు :**

1 సముద్రం
2. నఖం
4. పెళ్ళికొడుకు
5. చిన్న గిఫ్ట్
6. మనస్సునే వీణగా చేస్తే
9. పాపులేషన్
11. టేస్ట్
13. శూన్యము లేక లయం చేయుట

- కిరీటి

అని ప్రశ్నించకూడదు. అదియే నిజమైన భక్తికి లక్షణం. దేవుడు ఏదిచేసినా, మన మంచి కోసమే చేస్తాడు. పాండవులకు ఇన్ని కష్టములు పెట్టాడు. కట్టకడపటికి ఏమైంది? పాండవులు సర్వవిజయాలను సాధించారు. ఈ కష్టముల చేతనే పాండవుల యొక్క సత్కీర్తి జగత్ వ్యాప్తిగాంచింది. కనుక ఇట్టి పవిత్రమైన విషయాలతో మన హృదయం నింపుకోవాలి. అప్పుడే భక్తి ప్రపత్తులతో ఎట్టి కార్యములనైనా సాధించడానికి వీలవుతుంది. మీ ఉద్యోగాలలో కూడా ఇటువంటి దీక్ష ఉండాలి. ఇది నేను చేసే ఉద్యోగం, నాకర్తవ్యాన్ని నేను చక్కగా నిర్వర్తించాలి. దీనిని నేను మనఃపూర్వకంగా (Sincere) చేయకపోతే, నేను నాపని (Duty)కి అపకారం చేసినవాడనవుతాననే భావన ఉండాలి. ఉద్యోగం చేసినా, యోగం చేసినా, ఈ రెండింటియందు యోగతత్త్వం ఏకత్వంగా భావించాలి. కాని ఈనాటి మానవులకు యోగములో త్యాగము, భోగంలో వాంఛలు పెరిగిపోతున్నాయి. కాదు....కాదు...... **భోగానికి త్యాగం చేయాలి.** యోగాన్ని ప్రేమించాలి. ఇదియే మానవత్వంలోని సత్కర్మ. కనుక మనం ప్రతి దానిని యోగతత్త్వము లోపలనే సాధిస్తూ పోవాలి.

యోగమనగా ఏమిటి? భగవంతునితో కూడిక. Union with God is Yoga కనుకనే భగవద్గీతయందు మొదటి అధ్యాయమును 'విషాదయోగము' అన్నారు. విషాదము వచ్చిందని అర్జునుడు విరమించుకున్నాడా? ఆ విషాదం చేతనే "యత్ర యోగీశ్వర కృష్ణో....." అని భావించి ఆఖరిలో విజయాన్ని సాధించాడు మొదట అన్ని కష్టములే ఎదురవుతుంటాయి. కాని ఈ కష్టములే మనకు సుఖములను కూడా అందిస్తాయి. కమలాపండు మీద చేదు చర్మము మొదట ఉంటుంది. లోపల మధురమైన రసము ఉంటుంది. పై తొక్క తీసిపారవేసినప్పుడు దీని రసము మనకు ప్రాప్తిస్తుంది. బంగారంతో నగలు చేయాలంటే, దానిని అగ్నిలో కాల్చాలి. సుత్తితో కొట్టాలి, కత్తిరించాలి. ఆ తరువాతనే సుందరమైన నగ తయారు అవుతుంది. అదేవిధంగా మానవుడు బంగారం వంటివాడు. అతనికి శాంతి, సంతోషం, సౌఖ్యం కలగాలనుకుంటే అతనిని ఎన్నోరకముల బాధలుపెట్టాలి. భగవంతుని హిరణ్య గర్భాయనమః అన్నారు. అనగా బంగారు స్వరూపుడు భగవంతుడు, అందుకోసమనే నేను ఎప్పుడూ పిల్లలను 'బంగారు...బంగారు... అని పిలుస్తుంటాను. కనుక బంగారు అనే భగవంతుని మన చేతిలో పెట్టుకున్నప్పుడు, మనం ఎటువంటి ఎన్ని నగలనైనా చేయించుకోవచ్చును భగవంతుడే మన Gold కనుకనే భగవంతుని 'సువర్ణ గర్భుడు' అన్నారు. అలాంటి సువర్ణగర్భుడైన భగవంతుని మనం వశం చేసుకోవాలి. ఏ నగలనైనా మనం చేయించుకోవచ్చును. ఈనాడు లోకానికి శాంతి కావాలనుకుంటున్నాం. 'శాంతి' అనే నగలను ఆ బంగారం చేతనే చేయించుకోవచ్చును. బంగారం లేకుండా మనం ఏనగలను చేయించు కోవటానికి వీలు కాదు. కనుకనే భగవంతుడే మనకు బంగారం. ఆ బంగారమును సాధించడానికి తగిన ప్రయత్నం చేయాలి. అప్పుడే లోకంలో శాంతి నెలకొంటుంది. కనుక భగవంతుని స్వాధీనం చేసుకోవడానికి తగిన ప్రేమను మనం సంపాదించుకోవాలి. ప్రేమనే లేకుండిన చిన్న పదార్థం కూడా మనకు చిక్కదు. నీకు ఒక చిన్న చేతి రుమాలా కావాలంటే రు. 10-00లు యివ్వందే షాపువాడు యివ్వడు. భగవంతుని దగ్గరకు పోయి మోక్షం కావాలంటున్నాం, శాంతి కావాలంటున్నాం. మనం ఏమి యిచ్చి, యివన్నీ అడుగుతున్నాం. నీవు భగవంతునికి ఏమి యిస్తున్నావు? ఇవ్వనప్పుడు నీకు అడిగే అధికారం లేదు. ఇచ్చినప్పుడే, పుచ్చుకొనే అధికారం వస్తుంది. కనుక నీవు మొట్టమొదట ప్రేమను ఇచ్చుకో! శాంతిని పుచ్చుకో! ఏమీ యివ్వకుండా, నాకు అదియివ్వు! ఇది యివ్వు! అంటే ఎందుకిస్తాడు భగవంతుడు? కనుక భగవంతునికి ప్రేమను యివ్వాలి. సర్వమునూ అతని నుండి పొందాలి. ఇచ్చినప్పుడే అడిగే అధికారం లభ్యమవుతుంది. ఈ అధికారం ఒక్క ప్రేమ చేతనే మనకు లభ్యమవుతుంది. మరొక సాధన చేత మనకు ఏమాత్రం లభ్యం కాదు, కనుక ప్రేమను పెంచుకోండి.

"స్వామి మాతో మాట్లాడటం లేదే!" అని మీరు అనుకుంటుంటారు. అయితే **"స్వామి చెప్పినట్లు మేము నడచుకుంటున్నామా?"** అని విమర్శించుకోవటంలేదు. నాకు కూడా కొన్ని నిబంధనలు ఉన్నాయి. నేను యిచ్చిన దానిని మీరు పుచ్చుకున్నప్పుడు, అది సద్వినియోగంలేదు. అయితే నా ఆజ్ఞలనే మీరు ఉల్లంఘించి నడచుకుంటున్నప్పుడు, మీ యొక్క ఇష్టమును నేను ఏ విధంగా అంగీకరిస్తాను? మీరు కోరినదంతా నేను యిచ్చినప్పుడు, నేను చెప్పినదంతా చేయాలి గదా! చేస్తున్నారా? చేయటం

లేదు. కాబట్టి నామాటల విలువను తగ్గించుకోవటం నాకు ఇష్టం లేదు, నామాటలకు విలువ లేకుండా చేసుకోవటం నాకు యిష్టం వుండదు. కనుక నా మాటలకు, నా ఆజ్ఞలకు ఒక విలువ వుంటుండాలి. దానికి విలువ యివ్వనప్పుడు, మీకు విలువ ఏరీతిగా యివ్వగలను. ఇవ్వడానికి వీలు కాదు. నా ఆజ్ఞలను మీరు శిరసావహించి నడుచుకున్నప్పుడు, మీ ఇష్టమును నేను కూడా అంగీకరిస్తాను, భగవంతునికి ఎట్టి క్రోధమూ లేదు, ఎట్టి ద్వేషమూ లేదు. కాని చేసినదానికి తగినట్లుగా చేయాలి. మీ Action ను బట్టి Reaction కూడా ఉంటుంది. మీరు మంచిగా వుంటే, నేనూ తప్పక మంచిగానే వుంటాను మిమ్ములను మంచి మార్గంలో నడిపించే నిమిత్తమై, నేను ఈ విధంగా చేస్తుంటాను.

నాకు ఏ వాంఛాలేదు. ఎవ్వరి నుంచి నాకు కావల్సింది లేదు. ఎవ్వరినీ నేను అడుగను, అడుగనక్కరలేదు, అడగటం లేదు. ఎప్పుడూ నేను ఎవ్వరినీ ద్వేషించను. నాకు ఎట్టి ద్వేషమూ లేదు. నాకు ఎవ్వరూ ద్వేషులు లేరు. నేను ఎవ్వరికీ ద్వేషిని కాదు. అయితే మధ్యలో ఈ ప్రాకృతమైన కొన్ని పనులయందు ఈ మార్పులు జరుగుతూ వుంటాయి. అయితే ఒక విషయం గుర్తించాలి. ఇచ్చినటువంటిదానికి అనుగుణంగా నేను సక్రమంగా నడుచుకుంటున్నానా? లేదా? దానిని విచారణ చేసినప్పుడు నా యొక్క సమాధానం మీకు తప్పక చిక్కుతుంది. అది విచారణ చేయకుండా సమాధానం కావాలి! సమాధానం కావాలి! అంటే ఎలా? **భగవంతుడు అంత సులభప్రియుడు కాదు. భక్తప్రియుడే కాని, సులభప్రియుడు కాదు. అంత సులభంగా దక్కడు, చిక్కడు. కాని ప్రేమ చేత ఎక్కడైనా, ఎప్పుడైనా చిక్కుతాడు, దక్కుతాడు.** భగవత్ తత్త్వాన్ని మీరు చక్కగా గుర్తించాలనుకుంటే, మొట్టమొదట మీలోని దోషాలను నిర్మూలనం గావించుకోండి. ఎన్నెన్నో దోషాలను మీ పాత్రయందు నింపుకొని, స్వామీ! నీ అనుగ్రహం అనే ప్రేమ నాలో నింపమంటే ఎలా నింపటానికి సాధ్యమవుతుంది? నీ పాత్రనిండా దుష్ట భావములను నింపుకున్నావు. దానిలో పవిత్రమైన భావములను ఏరీతిగా వుంచడానికి వీలవుతుంది? ఆ దుష్ట భావాలను మొట్టమొదట పారవేయి! దానిని ఖాళీచేయి! అప్పుడు దానిలో పవిత్రమైన భావాలను నింపడానికి వీలవుతుంది.

ప్రేమస్వరూపులారా!

అందరికి భక్తి ప్రపత్తులున్నాయి. అయితే విధి విధానమును తప్పించుకోలేక, వారు ఈ విధమైన గతిని అనుభవిస్తున్నారు. అందరూ మంచి పిల్లలే. కాని వారికి ఏ విధంగా నడుచుకోవాలి? ఏవిధంగా చేయాలి? అనే విషయం తెలియకుండాపోతున్నది. ప్రాకృతమైన వాంఛలు అమితంగా చేరిపోతున్నాయి. ఈ వాంఛలు పెరిగిపోవటం చేతనే, దైవంపై వాంఛ తరిగిపోతున్నది. **"ఏమిలేని బుర్రలోన ఏమైనా చేర్చవచ్చు. ఏమేమో నిండియున్న తల బుర్రది ఖాళీఅగునా! తల బుర్రది ఖాళీగాక సుకృతం నింపనగునా!"** మొట్టమొదట ఆ బుర్రను ఖాళీచేయి. నేను తప్పక నింపుతాను. దానికే నేను సమయాన్ని యిస్తున్నాను. దానికే నేను కాచుకొని ఉన్నాను. నేను ఎప్పుడూ సిద్ధమే... సిద్ధమే.... ఎవరికైనా నేను సులభంగా లభ్యమగుతాను. ఎట్లా? మొట్టమొదట మీ హృదయాలను పరిశుద్ధంగా చేసుకోండి. అప్పుడే దానిలో నింపడానికి వీలవుతుంది.

ప్రేమస్వరూపులారా!

మానవత్వం చాలా పవిత్రమైనటువంటిది, దివ్యత్వమైనటువంటిది, ఎంతో అదృష్టమైనటువంటిది. ఇది భగవంతుడు అందించిన వరప్రసాదమే. ఈ వరప్రసాదమును సక్రమమైన మార్గంలో వినియోగించుకోండి. సరియైన పద్ధతిలో దీనిని అనుభవించండి. మిమ్ములను కన్న తల్లిదండ్రులను ఆనందపెట్టండి. వాళ్ళను కూడా ఆనందపెట్టకపోతే, ఇక స్వామి యొక్క ఆనందం ఎట్లా లభిస్తుంది? తనతత్త్వాన్ని మరచినటువంటివాడు, తనయందున్న దైవాన్ని ఏరీతిగా చూడగలడు? కనిపెంచిన తల్లిదండ్రులనే ప్రేమించలేనివారు, ఇక స్వామిని ఏవిధంగా ప్రేమిస్తారు? కనుక మొట్టమొదట అక్కడ వారి ప్రేమకు గురికాండి, తప్పక నాప్రేమ మీకు దక్కుతుంది, చిక్కుతుంది. అయితే పాపపు పనులలో మాత్రం ప్రవేశించకండి. ప్రవేశించి ఆ బాధలను భరించుకోలేక భగవంతునిపై నిందలు వేయకండి. **"పాపపు పనులను చేసి, ఫలమాపద కలిగినరోసి, కాపాడవు నీవనుచు, కడ నాపై నల్లెదరోయి!"** ఇదా! భగవంతునిపై వేసే నింద? ఇంతకంటె పరమ అజ్ఞానం వేరొకటిలేదు. నీ దోషములను నీవే అనుభవించాలి. భగవంతుడు దీనికి బాధ్యుడు కాదు. అయితే అన్నీ దైవం పైననే వదిలిపెట్టండి. 'సర్వకర్మ భగవత్ ప్రీత్యార్థం' అని భావించి కర్మలు చేయండి. అప్పుడు అంతా విజయమే చేకూరుతుంది.

*(ది. 14-1-2000 సాయంత్రం ప్రశాంతి నిలయంలో Sports Day ని పురస్కరించుకొని భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*



# పురుష సూక్తము

**9**

"తస్మాద్యజ్ఞా త్సర్వహుతః
సంభృతం పృషదాజ్యమ్ ।
పశూగం స్తాగం శ్చక్రే వాయవ్యాన్
ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే ॥"

**అర్థం :**

| | | |
|---|---|---|
| **"సర్వహుతః"** | : | సమస్తమూ హోమము చేయుట అను పేరుగల |
| **తస్మాత్ యజ్ఞాత్** | : | ఆ యజ్ఞం వలన |
| **పృషదాజ్యమ్** | : | చిలికిన వెన్న |
| **సంభృతమ్** | : | సమకూర్చబడినది |
| **సః అతడు యే** | : | ఏవైతే |
| **ఆరణ్యాన్** | . | అరణ్యజీవులు |
| **వాయవ్యాన్** | : | వాయుచర పక్ష్యాదులు |
| **పశూన్** | : | పశువులు |
| **గ్రామ్యా** | : | పెంపుడు జంతువులు గలవో |
| **తాన్** | : | వాటిని |
| **చక్రే** | : | సృజించినాడు |

**వ్యాఖ్య :** 'సర్వహుతః' అనే మహాయాగం జరిగింది. యాగ ప్రక్రియగా యజ్ఞపురుషుడి మానసం మథించబడింది. మానస మథనం వలన సర్వశక్తిదమూ పవిత్రము అయిన వెన్నకాచిన నెయ్యి వెలువడింది. అదియే పురుష వీర్యం. శుక్రం. ఆ వీర్య పరమాణువులలో అన్నిప్రాణికోటుల రూపాలు జీవాలు ఇమిడి ఉన్నాయి. ఆ వీర్యం వలన సర్వజీవరాసులూ సృష్టించబడ్డాయి.

'సర్వహుతం' అనేది రెండు విధాలు. ఒకటి పరిమితం.- 'పురుషమేధం'. రెండు అపరిమితం - 'సర్వమేధం'. పృషదాజ్యం శుక్రశోణిత మిశ్రమం. ఇది మహదహంకార జీవ జనన హేతువు. ఈ వీర్యం ద్వారానే బ్రహ్మ సృష్టి జరుగుతోంది. పశుపక్ష్యాదులు అత్యంత అణురూపాలుగా బీజరూపంలో ఉంటాయి. ఆయా కాలాలలో రూపుదిద్దుకొంటాయి.

ఇవియే భూమి చుట్టూగల రాశిచక్రం. శింశుమార చక్రం. సప్తర్షి మండలాదులలో కొంత కొంత విశదమవు తుంటాయి. నవీన విజ్ఞాన శాస్త్రానికందనివి ఎన్నో!!

**- జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

## భగవాన్ సాయి దివ్యశక్తి

రిటైర్డ్ టీచర్ సి. రామరాజు గారి కుమార్డు సి. వెంకట రమణరాజు కొన్ని కారణముల వలన ఇంటి పరిస్థితి దీనావస్థలకు గురి అవుతున్న సమయంలో నాతో పరిచయము జరిగింది. ఈ సందర్భములో భగవాన్ శ్రీ సత్యసాయిబాబాను నమ్ముకుని బాగైన వారు ఎందరో ఉన్నారు అని నేను రమణతో చెప్పినాను. అతనికి నా మాటపై విశ్వాసం ఏర్పడినది. ఇది జరిగిన కొద్ది రోజులకే కరీంనగర్ జిల్లా వాసులకు 'స్వామి' పాద నమస్కారం ఇస్తున్నారంటే వాళ్ళతో పర్తికి (ప్రశాంతి నిలయం) వెళ్ళుతూ మార్గ మధ్యములో పెద్దలకు సేవ చేస్తూ ప్రశాంతి నిలయం చేరుకున్నాడు. స్వామి పాద నమస్కారం ఇస్తూ రమణ చేతివ్రేలుకు ఒక బంగారు ఉంగరం సృష్టించి పెట్టినారు. అతడు తిరిగి ఇంటికి చేరుకొన్న తర్వాత స్వామి కృప మరియు పెద్దల అనుగ్రహముతో కంప్యూటర్ కోర్సులో చేరినాడు. ఇప్పుడతను కంప్యూటర్ రెండవ సం॥ హైదరాబాదులో చదువుచున్నాడు. తేది 11-2-2000 రోజున ఒక సంఘటన జరిగినది. హైదరాబాద్‌లో 'రమణ' ఇంటి ప్రక్కన ఒక టేకు వనం వుంది. ఆ టేకు వనంలోకి 11వ తేదినాడు అతడు బహిర్భూమికి వెళ్ళినాడు. బహిర్భూమికి కూర్చున్న వెంటనే అతడి ఎడమవైపు నుండి ఒక నాగసర్పము ముందుకు వచ్చి పడగ విప్పి నిలిచినది. పిల్లవాడు భయపడి అట్లే కూర్చుండి పోయినాడు. ఆ సర్పము వాని చుట్టూ తిరిగి యధాస్థితికి తిరిగివచ్చి పడగ విప్పినది. అప్పుడు అతని మెదడు ఏమీ పనిచేయలేని పరిస్థితిలో పాముకు రెండు చేతులతో నమస్కారము చేసినాడు. ఆ పాము తన చేతి వ్రేలుకుయున్న బాబా ఇచ్చిన ఉంగరమును స్పర్శి ంచి వెళ్ళిపోయినది. మరి ఇదంతా 'బాబా' అనుగ్రహమే కదా.......

రెండవది హైదరాబాద్‌లోని 'మల్కాజ్‌గిరి'లో స్వామి పటమునకు విభూతి వస్తున్నదని తెలిసి జమ్మికుంటలో కొందరు సాయి భక్తులు వెళ్ళి చూచి వచ్చి ఇతర భక్తులకు తెలియజేసినారు. ఇంక చాలామంది భక్తులు అక్కడకు పోవుటకు సిద్ధముగా యున్న సమయములో, మందిరంలో నేను స్వామితో మా జమ్మికుంటలో కూడా ఒక మహిమ చూపించలేవా స్వామి! అని ప్రార్థించాను. అందుకు ఇప్పుడు జమ్మికుంటలోని 'మురికి మహేందర్'గారి ఇంటిలో బాబా ఫోటోకు ముఖభాగం అంతా ఖాళీగా యుండి మిగతా భాగమంతా కుంకుమ వచ్చినది. ఇది మా జమ్మికుంటపైన స్వామి యొక్క కృప యున్నట్లుగా భావించి భక్తులు ఆనంద పరవశములో వున్నారు......

**- బి. కుండికేశ్వర్, జమ్మికుంట.**

## శ్రీవాణి జీవిత సభ్యులు



Dr. S.R. Ranganathan
Visakhapatnam-530 023



Sri Grandhi Visweswara Rao
Smt. Grandhi Bhuvaneswari
Puttaparthi - 515 134



Sri Y. Setu Madhava Rao, B.E.,
Hyderabad - 500 062



Dr. K. Somasekharam
Hyderabad - 500 047



Sri P.S.S. Baba
Smt. Sobha P. Sai
Bangalore



Sri Meesa Satyanarayana
Kodada - 508 206
Nalgonda District

## శ్రీవాణి పోషకులు



Smt. & Sri Karri Krishnamma
Veeraghattam

### శ్రీవాణిని ప్రోత్సహించండి !

శ్రీవాణికి జీవిత సభ్యత్వం, సంవత్సర చందాలు పంపి ప్రోత్సహిస్తున్న వారికి అభినందనలు. ఇంకా ఎక్కువ మంది చేత క్రొత్త చందాలు చేర్పించి, పంపి శ్రీవాణి చేస్తున్న కృషికి అండగా నిలుస్తారని ఆశిస్తున్నాను. రెన్యూల్ చేయవలసిన వారు వెంట వెంటనే చేస్తూ శ్రీవాణిని ప్రోత్సహించ మని కోరుతున్నాను. ప్రతి చందాదారుడు కనీసం ఒక క్రొత్త చందాను చేర్పించి, పంపి శ్రీవాణి ద్వారా ప్రచారం చేయబడుతున్న నైతిక, ధార్మిక ఆధ్యాత్మిక సందేశాలను ముఖ్యంగా భగవాన్ సాయి సందేశాలను విస్తృతంగా ప్రచారం చేసే మహా ప్రయత్నంలో భాగస్వాములై తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించమని వేడుకుంటున్నాను శ్రీవాణిని ప్రోత్సహించండి! ఉన్నత విలువలను కాపాడండి

సం.

Postal Registered
No H/M PM /34, D. 10-12-1984

Regd with Registrar of News
Papers Regd No. 45039/85





EDITED, PRINTED AND PUBLISHED BY **SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO**

*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001 Ph: 21137*